# STREEJATAKAM

# స్త్రీజాతకము.

(ఋతుఫలాధ్యాయసహితము)

దైవజ్ఞ కల్యాణవర్మవిరచితము






ఈ గ్రంథము,

స్త్రీల జాతకఫలంబులఁ దెలియఁగోరువారికిని, జ్యోతిషికులకును

ఉపయుక్తంబగునట్లు

ఆంధ్ర తాత్పర్యముతో

తెన్మఠము-శ్రీరంగాచార్యులచే

ముద్రింపించి ప్రకటింపఁబడియె

రెండవకూర్పు

చెన్నపురి సాహుకార్ పేట, 9 పళ్లియప్పన్ వీధి.

శ్రీ ఆదిమూల ముద్రాక్షరశాలా ముద్రితము

1926



దీనివెల రు 0 8 0 విపికర్చులు ప్రత్యేకము

# విజ్ఞప్తి

సుజనులారా !

---

స్త్రీపురుషులు అనుకూలదాంపత్యముకలవారై సౌఖ్యకారకంబులగు సౌభాగ్య దీర్ఘాయుర్భావంబులనొందుటను దెలిసికొనుటకునవగ్రహస్థితియే ముఖ్యకారణము, అదియును పూర్వజన్మకృతకర్మపరిపాకవశమున నుండును గదా ! అట్టిగ్రహస్థితినిదెలుపునది సకలకర్మానుష్ఠానకారణంబై వేదాంగమగుజ్యోతిశ్శాస్త్రము; అద్దానిని జనులు సులభంబుగ గ్రహించుటకై ప్రాచీనులగు దైవజ్ఞులు గొందఱు అనేక గ్రంథములుగ నేర్పరచి వానిలో పురుషజాతకఫలంబులనే విశేషముగ వక్కాణించి స్త్రీలజాతకఫలంబులను సంక్షేపంబుగనుడివిరి అట్లుగాక స్త్రీలజాతకఫలంబు లొక్కచో దెలియునట్లు నానాజాతకగ్రంథములనుండి సంగ్రహించి కల్యాణవర్మయను దైవజ్ఞుండు వృద్ధయావనానుసారముగ సంస్కృతభాషయందు రచియించిన స్త్రీజాతక మను నీ జ్యోతిషగ్రంథమునుఋతుజాతకఫలసహితముగానంటకు సుగ్రహంబగుటకై ఆంధ్ర తాత్పర్యముతోడ తొలుత ముద్రింపించితిమి ఆప్రతులన్నియు సర్వజనాదరణంబునొంది అచిరకాలంబుననే సెలవయ్యె. పదంపడిముద్రింపించుటకుకొన్ని కారణంబులచే ననువుపడక చిరకాలముగడచెదానం జేసి యేతద్గ్రంథాలాపగలవారికి గ్రంథములభింపకుండుటచే అట్టికొఱతనివర్తించుటకై యిప్పుడీ ద్వితీయముద్రణముగావింపఁబడినది. ఇదియును మంచికాగితములపై ముచ్చటగలిగించు చిన్నపాత్రముగ ముద్రింపఁబడినది కావున దీనిని సుజనులందఱును గైకొని పఠించి వివాహాదులయందు స్త్రీలజననకాల ఋతుకాల గ్రహస్థితిఫలంబుల నెఱుంగ నగునని విన్నవించితి.

---

శ్రీరస్తు.

## విషయసూచిక.





శ్రీకృష్ణాయ నమః.

# స్త్రీజాతకము.

ఆంధ్రతాత్పర్యసహితము.

## త్రింశాంశాదిఫలాధ్యాయము.

శ్లో॥ అర్కమణ్డలమధ్యస్థం శంఖచక్రధరం విభుమ్।
పద్మాసనే సమాసీనం దేవం నారాయణం భజే॥

శ్లో॥ శ్రీవిష్వక్సేనపాదాబ్జయుగళీం ప్రణమామ్యహమ్।
వజ్రధారాయతే యస్య నమస్యా విఘ్నరాశిషు॥
నానాజాతకశాస్త్రాణి విలోక్య విదుషాం ముదే।
కుర్వే స్త్రీజాతకం నామ్నా స్ఫుటం గురుకటాక్షతః॥

వృద్ధయవనే - కల్యాణవర్మా—

శ్లో॥ స్త్రీణాం జన్మఫలం తుల్యం పుంభిస్సార్థం యదుక్తవాన్।
విశేషస్తత్ర యో దృష్టః కథ్యతే విస్తరేణ సః ॥ ౧ ॥

తా॥ స్త్రీలకు జన్మలగ్నాదులవలనను వానియందు సూర్యాదిగ్రహసంబంధమువలనగను లిగడి శుభాశుభఫలంబులు - పురుషులతో సమానముగనుండును - అయినను స్త్రీలకు - జన్మలగ్నాదులయందు - ఏఫలము విశేషముగ కానంబడుచున్నదో - ఆఫలము - ఈగ్రంథమునందు విస్తరముగా జెప్పంబడును. (౧)

శ్లో॥ వైధవ్యం నిధనే నిత్యం శరీరం లగ్నజన్మభాక్।
సప్తమే సౌఖ్యసౌభాగ్యం పంచమే ప్రసవస్తథా॥ ౨॥

తా॥ స్త్రీలకు-జన్మలగ్నమునకు అష్టమస్థానమునుపట్టి-వైధవ్యచింతయును, జన్మలగ్నమునుపట్టి-శరీర సౌఖ్యాదిచింతయును, సప్తమస్థానమునుబట్టి- సౌఖ్య, సౌభాగ్యాదిచింతయును, పంచమస్థానమునుపట్టి-ప్రసవచింతయును చేయవలయు. (౨)

శ్లో॥ ప్రకృతిస్థా లగ్నేంద్వో స్సమభే సచ్ఛీలరూపా చ।
భూషణగణైరుపేతా శుభవీక్షితేతయోశ్చయువతిస్స్యాత్॥

తా॥ స్త్రీజన్మలగ్నము - సమలగ్నమైనను, సమరాశియందు చంద్రుడుండినను జనించిన స్త్రీ - స్త్రీస్వభావముగలదిగనుండు - మఱియు నాలగ్నచంద్రులు-శుభగ్రహములచే వీక్షింపబడిరేని - యా స్త్రీ - మంచిస్వభావము-మంచిరూపము-భూషణ సమూహమును కలదియగును. (3)

శ్లో॥ పురుషాకృతిశీలయుతా దుశ్శీలా దుఃఖితా విషమరాశౌ।
క్రూరైర్వీక్షితయోగే పాపా స్త్రీ సద్గుణైర్హీనా॥౪॥

తా॥ స్త్రీజన్మలగ్నము విషమమైనను, విషమరాశియందు చంద్రుడుండినను - జన్మించిన స్త్రీ - పురుషాకృతి, పురుషస్వభావము, దుష్టచేష్ట, దుఃఖము, వీనితోగూడియుండు. మఱియు నా లగ్న చంద్రులు - క్రూరగ్రహములచే వీక్షింపబడిరేని - పాపాచారము, దుర్గుణములు, ఇవికలదియగు(లగ్నచంద్రులలోనొకటి - శుభగ్రహయుతమైకాని, దృష్టమైకాని మఱియొకటి, పాపగ్రహయుతమైకాని, దృష్టమైకాని యుండగా జనించినవనిత- కొన్నిసదాచారములు, కొన్నిదురాచారములునుగలిగియుండు. చంద్రలగ్నములురెండును - శుభాశుభమిశ్రగ్రహయుత దృష్టములై యుండఁగా బుట్టిన స్త్రీ - మిశ్రగుణములుగలది యగును. (౪)

త్రింశాంశాదిఫలము.

లగ్నేంద్వోర్యో బలవాంస్తత్త్రింశాంశాధిపైస్తైః ఫలంక్రమశః।
భూసుత భార్గవ బోధన సురపతిగురు తీవ్రకరపుత్రైః॥౫॥



తా॥ లగ్నచంద్రులలోనేదిబలీయమో- ఆలగ్నసంబంధమైన, లేక చంద్రాధిష్ఠిత రాశిసంబంధమైన త్రింశాంశ లేవిగలవో - ఆత్రింశాంశాధిష్ఠితగ్రహములగు కుజ శుక్ర బుధ గురు శనులనుపట్టి ఫలమును క్రమముగ వచింపవలయు. (౫)

శ్లో॥ కన్యైవారగృహే దుష్టా భౌమత్రింశాంశకే భవేత్।
కుచరిత్రా తథా శౌక్రే సమాయా బౌధనేఽబలా॥

తా॥ కుజక్షేత్రములైన - మేషవృశ్చికములలో నొకరాశి లగ్నమైకాని-చంద్రాధిష్ఠితమైకానియుండగా - కుజత్రింశాంశయందు జన్మించిన స్త్రీ - వివాహాత్పూర్వమే పురుషసంపర్కముగలదియగు. శుక్రత్రింశాంశయందు జన్మించిన స్త్రీ - దురాచారయుక్తురాలగును, బుధత్రింశాంశయందు జన్మించిన స్త్రీ - మాయావంతురాలగును. (౬)

శ్లో॥ జైవే సాధ్వ్యర్కజే దాసీ జ్ఞర్క్షే కౌజే తు కాపటీ।
శౌక్రే వికీర్ణకామా చ బౌధే గుణవతీ భవేత్॥౭॥

తా॥ గురుత్రింశాంశయందుజన్మించినకన్య. పతివ్రతయగును. శనిత్రింశాంశయందుజన్మించినకన్య - దాసీభావమునుపొందును—ఇటుల మేషవృశ్చికములలో - కుజాదిత్రింశాంశలఫలము ముగిసెను—బుధక్షేత్రములైన కన్యా మిథునములలోనొకరాశి లగ్నమైకాని- చంద్రాధిష్ఠితమైకానియుండగా- కుజత్రింశాంశయందుజనించినకన్య- కపటముగలిగియుండు_ శుక్రత్రింశాంశయందుజన్మించిన స్త్రీ - అనేకపురుషులయందు వ్యాపించిన కామముగలదియగు. బుధత్రింశాంశయందు జన్మించిన స్త్రీ-ప్రశస్తగుణములుగలదియగును. (౭)

శ్లో॥ జైవే సతీ శనౌ క్లీబా కౌజే దుష్టా సితర్క్షగే।
శౌక్రేఖ్యాతా గుణైర్బౌధే కలాసునిపుణా మతా॥౮॥

తా॥ గురుత్రింశాంశయందు జన్మించిన స్త్రీ - పతివ్రతయగును శనిత్రింశాంశయందు జన్మించిన స్త్రీ - నపుంసకసమానురాలుగనుండు. ఇటులకన్యామిథునములలో- కుజాదిత్రింశాంశఫలముముగిసెను—శుక్రక్షేత్రములైన వృషభతులలలో నొకరాశిలగ్నమైకాని - చంద్రాధిష్ఠితమైకానియుండగా - కుజత్రింశాంశయందు జన్మించిన స్త్రీ - దుర్మార్గురాలగును. శుక్రత్రింశాంశయందు జన్మించిన స్త్రీ - సౌశీల్యాదిగుణములచే ప్రసిద్ధురాలగును. - బుధత్రింశాంశయందుజన్మించిన స్త్రీ. గీతాదికళాప్రవీణురాలగును. (౭)

శ్లో॥ జైవే గుణాన్వితా మందే పునర్భూశ్చంద్రభే మతా।
స్వచ్ఛందా వనితా కౌజే శౌక్రే చ కులపాంసనీ॥౮॥

తా॥ గురుత్రింశాంశయందుజన్మించిన స్త్రీ - మంచిగుణములుగలదియగు. శనిత్రింశాంశయందుజన్మించిన స్త్రీ - వివాహానంతరము మరల మరియొకని పెండ్లియాడును—ఇటుల - వృషతులలలో - కుజాదిత్రింశాంశఫలముముగిసెను—చంద్రరాశియగుకర్కాటకము లగ్నమైకాని - చంద్రాధిష్ఠితమైకానియుండగా - కుజత్రింశాంశయందు జన్మించిన స్త్రీ-యథేష్ట వ్యవహారముకలదిగనుండు. శుక్రత్రింశాంశయందు జన్మించిన స్త్రీ- వ్యభిచారిణియగును. (౮)

శ్లో॥ బౌధే శిల్పాన్వితా నారీ జైవే బహుగుణా స్మృతా।
పతిఘ్నార్కేఽర్కభే కౌజే న్రాచారా భార్గవే సతీ॥

తా॥ బుధత్రింశాంశయందుజన్మించిన స్త్రీ - శిల్పకలాప్రవీణురాలగును. గురుత్రింశాంశయందు జనించిన స్త్రీ -అనేకసుగుణములుకలదిగనుండు. శనిత్రింశాంశయందుజన్మించిన స్త్రీ - పతినిజంపునట్టిదగు—ఇటుల కర్కాటకరాశిలో - కుజాదిత్రింశాంశలఫలము ముగిసెను—రవిరాశియగు



సింహము లగ్నమైకాని - చంద్రాధిష్ఠితమైకానియుండఁగా - కుజత్రింశాంశయందుజన్మించిన స్త్రీ- పురుషాచారముకలదిగనుండు (కొందరుబహుభాషిణియగునని చెప్పుదురు) శుక్రత్రింశాంశయందుజన్మించిన స్త్రీ - వ్యభిచారి యగు. (౧౦)

శ్లో॥ బౌధే పుంశ్చేష్టితా జీవే రాజ్ఞీ మందే కులచ్యుతా।
జీవర్క్షగే బహుగుణా కౌజే శౌక్రే సతీ స్మృతా॥ ౧౧॥

తా॥బుధత్రింశాంశయందుజన్మించిన స్త్రీ పురుషస్వభావముగలదిగనుండు. గురుత్రింశాంశయందుజన్మించిన స్త్రీ- రాజభార్యయగును. శనిత్రింశాంశయందుజన్మించిన స్త్రీ - కులమునువిడిచిపోవును—ఇటులసింహరాశిలో -కుజాదిత్రింశాంశలఫలముముగిసెను. గురుక్షేత్రములగుధనుర్మీనములలో నొకటిలగ్నమైకానిచంద్రాధిష్ఠితమైకానియుండఁగాకుజత్రింశాంశయందు జన్మించినవనిత - బహుగుణములుగలదిగనుండు - శుక్రత్రింశాంశయందు జన్మించినకన్యక వ్యభిచారిణియగును. (౧౧)

శ్లో॥ బౌధే విజ్ఞానసంపన్నా జైవే నైకగుణా స్మృతా।
మందే చాల్పరతా ప్రోక్తా దాక్షీ కౌజే తథార్కభే॥

తా॥ బుధత్రింశాంశయందుజన్మించిన స్త్రీ- శిల్పశాస్త్రజ్ఞానముకలదిగనుండు- గురుత్రింశాంశయందుజన్మించిన స్త్రీ - బహుగుణవతియగును. శనిత్రింశాంశయందుజన్మించినకన్య- అల్పరతిగలదియగును—ఇటులధనుర్మీనములలో-కుజాదిత్రింశాంశలఫలముముగిసెను. శనిక్షేత్రములైనమకరకుంభములలోనొకరాశిలగ్నమైకాని - చంద్రాధిష్ఠితమైకానియుండఁగా-కుజత్రింశాంశయందుజన్మించిన స్త్రీ దాసియగును. (౧౨)

శ్లో॥ అప్రజా చ భవేచ్ఛౌక్రే బౌధే దుష్టా ఖలా తథా।
జైవే పతివ్రతా నిత్యం మందే నీచానుసేవినీ ॥౧౩॥

తా॥ శుక్రత్రింశాంశయందు జన్మించినస్త్రీ గౌడ్రాలగును. బుధత్రింశాంశయందు జన్మించినవనిత దుర్మార్గురాలగును. గురుత్రింశాంశయందు జన్మించినకన్య - పతిభక్తిగలదియగు. శనిత్రింశాంశయందుజన్మించిన స్త్రీ - నీచపురుషగామినియగును (ఏరాశియందు - ఏగ్రహసంబంధమైన త్రింశాంశయందు చంద్రుఁడుండునో ఆత్రింశాంశనుబట్టియు ఏరాశి లగ్నమగునో ఆలగ్నమునందు ఏగ్రహత్రింశాంశ ఉదయించునో ఆలగ్నత్రింశాంశనుబట్టియు - ఫలముచెప్పదగినదని చెప్పఁబడెనుగదా - అందొకరాశియందు - ఒకత్రింశాంశయందు చంద్రుఁడును, మఱియొకరాశియందు మఱియొకత్రింశాంశయందు లగ్నంబునుండెనేని - అపుడు - చంద్ర లగ్నములలో నేదిబలీయముగనుండునో - అదియే త్రింశాంశయందుండునో - ఆత్రింశాంశకు జెప్పియున్న ఫలమే చెప్పదగినదిగాని - బలహీనమైనదానికి జెప్పియున్న త్రింశాంశఫలము చెప్పదగినదికాదని తాత్పర్యము.) (౧౩)

ఇటుల త్రింశాంశఫలముముగిసెను.

## నవాంశఫలములు.

శ్లో॥ శుక్రాసితౌ యది పరస్పరభాగసంస్థౌ,
శౌక్రే చ దృష్టిపథగౌ వుదయే ఘటాంశాః।
స్త్రీణా మతీవ మదనాగ్నిమదప్రవృద్ధిః,
స్త్రీభిస్సమం చ పురుషాకృతిభీ రమేచ్చ॥ ౧౪॥

తా॥ శుక్రశనులు - ఏరాశియందైన శనినవాంశయందు శుక్రుడును - శుక్రనవాంశయందు శనైశ్చరుడును - ఉన్నవారలై - ఒకరినొకరుచూచుచుండినను - ఇదిఒకయోగము - శుక్రక్షేత్రములైన వృషతులలలో నొకరాశి జన్మలగ్నమై - ఆలగ్ననవాంశ కుంభనవాంశయయినను - ఇదిరెండవయోగము - ఈరెంటిలో నొకయోగమునబుట్టిన స్త్రీ - అతికామాసక్తయై పురుషసంభోగముచే తృప్తిబొందక - చర్మమయలింగమునుగట్టుకొనియున్న మఱియొక స్త్రీతో రమించును. (౧౪)



అన్యోన్యభాగగతయో స్సితకుజయో రన్యపురుషసక్తాస్యాత్।
ద్యూనే శశిదినకరయో స్స్యాద్వ్యవతి రనుజ్ఞయా భర్తుః॥౧౫॥

తా॥ శుక్రాంగారకులు - ఏరాశియందైన - శుక్రనవాంశయందుకుజుడును - కుజనవాంశయందు శుక్రుఁడు నుండగా జన్మించిన స్త్రీ - స్వేచ్ఛచేతనే పరపురుషాసక్తురాలగును. సప్తమస్థానమందు సూర్యచంద్రులుండిరేని భర్తయొక్క ఆజ్ఞచేత పరపురుషాసక్తురాలగును. ౧౫॥

శ్లో॥ ద్యూనే తు కుజనవాంశే శశినాదృష్టే చ రోగయోనిః స్త్రీ।
సద్గ్రహగే భాగే వా సుశ్రోణి ర్భర్తృవత్సలా భవతి॥
తా॥ సప్తమస్థానము - కుజనవాంశయై - శనిచేతచూడబడుచుండగా - వ్యాధిపీడితభగయగును. ఆసప్తమస్థానము - శుభగ్రహసంబంధముగలదై - శుభనవాంశయైయుండెనేని - మంచిపిఱుదులుగలదియు, భర్తకు ప్రియురాలునగును. (౧౬)

శ్లో॥ ద్యూనే వృద్ధో మూర్ఖ సౌరగృహే స్వనవాంశకే వాథ।
స్త్రీలోలః క్రోధపరః కుజభే థ నవాంశకే భర్తా॥౧౭॥

తా॥ శనిక్షేత్రములైన - మకర - కుంభములలో నొకరాశిగాని ఆనవాంశగాని - సప్తమమగుచుండఁగా - స్త్రీయొక్క భర్త ముసలివాఁడును, మూర్ఖుఁడునగు. కుజక్షేత్రములైన - మేషవృశ్చికములుగాని - ఆనవాంశగాని - సప్తమమగుచుండఁగా - స్త్రీభర్త - స్త్రీలోలుడును - కోపస్వభావుఁడునగును. (౧౭)

శ్లో॥ శుక్రగృహేనవభాగేవా తిరూపసౌభాగ్యసంయుతో భర్తా।
నైపుణ్యవిజ్ఞానయుత స్తథైవ బుధభే నవాంశకేవాస్యాత్॥

తా॥ శుక్రక్షేత్రములైన - వృషభతులలలో నొకరాశిగాని- ఆనవాంశగాని - సప్తమమగుచుండఁగా - స్త్రీయొక్కభర్త-అతిసౌందర్యము మిక్కిలి సౌభాగ్యమువీనితోఁగూడినవాఁడగు. బుధక్షేత్రములైన కన్యామిథునములలో నొకరాశిగాని - ఆనవాంశగాని - సప్తమమగుచుండఁగా స్త్రీయొక్కభర్త - పండితుఁడు మంచినేర్పుగలవాఁడునగును.

శ్లో॥ మదనార్తో మృదుచిత్త శ్శశిభే థ నవాంశకే భర్తా।
గురుసితభాగేప్యథవా గుణవా న్విజితేంద్రియో భవతి॥

తా॥ చంద్రక్షేత్రమైన కర్కాటకరాశిగాని - ఆనవాంశగాని - సప్తమమగుచుండఁగా - స్త్రీయొక్కభర్త -కామాతురుఁడుగను, మృదుస్వభావుఁడుగనగు, గురుక్షేత్రములైన ధనుర్మీనములలో నొకరాశిగాని- ఆనవాంశగాని - సప్తమమయ్యేనేని - స్త్రీయొక్కభర్త మంచిగుణములుకలవాఁడును - జితేంద్రియుఁడు నగును. (౧౯)

శ్లో॥ అతికర్మకర స్త్రీక్ష్ణో రవిభే థ నవాంశకే భవతి।
భర్తాసప్తమభవనోపగతై ర్నిత్యం స్త్రీణాం సమవధార్యః॥

తా॥ రవిక్షేత్రమైనసింహముగాని - ఆనవాంశగాని . సప్తమస్థానమాయెనేని స్త్రీ యొక్కభర్తమిక్కిలిమృదుస్వభావుఁడును, . బహువ్యాపారముసేయువాఁడును అగును. (కొందరుకామాసక్తుడౌనని చెప్పుదురు. ఈచెప్పబడినరాశినవాంశలలో- రాశి-యొకగ్రహసంబంధియు, నవాంశ మఱియొకగ్రహసంబంధియు నైయుండెనేని-అపుడురాశ్యధిపనవాంశాధిపతులలో - రాశ్యధిపతి బలాధికుఁడై యుండెనేని - రాశిఫలంబును, నవాంశాధిపతి బలాధికుఁడై యుండెనేని, నవాంశఫలంబును జెప్పదగినది.)



## మిశ్రఫలములు,

శ్లో॥ అశుభే బుక్షేఽస్తగతే అనపత్యా భవే దశుభదృష్టే।
క్రూరైర్విధవా స్తగతై ర్భవతి పునర్భూ స్తథా మిశ్రైః॥

తా॥ సర్వబలరహితమైనపాపగ్రహము - సప్తమస్థానమందుండి అశుభదృష్టిగలిగిన, స్త్రీ - సంతానములేనిదియగును. సప్తమస్థానమందు పాపగ్రహములుండిన, స్త్రీ - విధవయగును . శుభాశుభ గ్రహములు మిశ్రమములై సప్తమస్థానమందుండఁగా - మొదటిమగనివిడిచి - మఱియొకని బెండ్లియాడును. (౨౧)

శ్లో॥ సౌరారగృహేతద్వ చ్ఛశినిసశుక్రే విలగ్నగే జాతా।
మాత్రాసార్ధంకులటా క్రూరగ్రహావీక్షితే భవతి॥

తా॥ కుజ - శని - క్షేత్రములైనమేష - వృశ్చిక - మకర - కుంభములలో నొకటి లగ్నమై, లగ్నము - చంద్ర - శుక్రులతోఁగూడినదై పాపగ్రహములచేత చూడబడుచుండఁగా - స్త్రీ - తల్లితోఁగూడ వ్యభిచారిణియగును. (౨౨)

శ్లో॥ శూన్యేస్తే కాపురుషే బలహీనేసౌమ్యదర్శనే హీనే
చరభే ప్రవాసశీలాభర్తా క్లీబోజ్ఞసౌరయో ర్ద్యూనే॥

తా॥ లగ్నమునకుగాని - చంద్రునికిగాని - సప్తమస్థానము - గ్రహవర్జితమై - బలరహితమై - శుభవీక్షణములేకయుండఁగా - జన్మించిన స్త్రీయొక్కభర్త-కుత్సితపురుషుఁడౌను. లగ్నమునకుగానిచంద్రునికిగాని- సప్తమరాశియందు - బుధశనులలోనొకఁడుండఁగా - జన్మించిన స్త్రీయొక్కభర్త - పుంస్త్వవిహీనుఁడౌను. సప్తమరాశిచరరాశియయ్యెనేని-భర్తపరదేశముతిరిగెడివాఁడగును (అనగా స్త్రీజన్మరాశికి-సప్తమరాశి స్థిర

రాశియయ్యేనేని - భర్త ఎల్లప్పుడు గృహమందేయుండుననియు - ద్విస్వభావరాశియయ్యేనేని - కొన్నిదినములుదేశాంతరమందును-కొన్నిదినములు గృహమందు నుండుననియును భావము. (౨౩)

శ్లో॥ ఉత్సృష్టాసూర్యేఽస్తే కుజేస్తేవిధవాభవే న్నవోఢైవ।
కన్యైవాశుభదృష్టే శనైశ్చరే వృద్ధతాంయాతి॥ ౨౪॥

తా॥ జన్మలగ్నమునకు- సప్తమమునందు సూర్యుఁడుండగా- జన్మించినవనిత-పతిచేతవిడువబడునదౌను. సప్తమమునందు - అంగారకుఁడుండి-పాపగ్రహములచేతచూడఁబడుచుండఁగా స్త్రీవివాహముకాగానేవిధవయగును. సప్తమమునందు శనియుండి పాపగ్రహములచేత చూడబడుచుండగా - స్త్రీ వివాహములేకయే ముసలితనమునుపొందును. (ఇక్కడ లగ్నచంద్రుల బలాబలమునుబట్టి ఈఫలముచెప్పదగినది. సప్తమస్థానమందున్నచంద్రునికి - వేరుఫలముచెప్పకపోవుటవలన- లగ్నమునకుగాని-చంద్రునికిగాని సప్తమస్థానమునుబట్టి ఈఫలములుచెప్పదగినవని - తోఁచెడిని,

## చంద్రశుక్రబుధులలోఁగొందఱులగ్నమందుండఁగాఁ బుట్టినస్త్రీ స్వభావములు.

ఈర్ష్యాన్వితాసుఖపరా లగ్నే సితచంద్రయోర్బుధేందోశ్చ।
సుఖితా కలాసు కుశలా గుణసుతసహితా వినీతా స్యాత్॥

తా॥ చంద్రశుక్రులు - లగ్నమందుండగా జన్మించినస్త్రీ - మాత్సర్యయుక్తురాలుగ - సుఖాసక్తురాలుగనగు. బుధచంద్రులు లగ్నమందుండగాజన్మించినస్త్రీ-గీతవాద్యాదికళలయందు సమర్థురాలుగ - సుఖముగలదిగ గుణవంతులగు పుత్రులు కలదిగ- వినయ సంపత్తిగలదిగను నగు.



శుక్రబుధయోర్విలగ్నే రుచిరా సుభగా కలాసునిపుణాచ।
ద్రవ్యాంబరసౌఖ్యయుతా శుభేషు పాపేషు విపరీతాః॥ ౨౫॥

తా॥ శుక్రబుధులులగ్నమందుండఁగా జన్మించినస్త్రీ- మనోహరురాలుగను - సౌభాగ్యవంతురాలుగను - గీతవాద్యాదికళలనెఱుంగునదిగనగు. మఱియు- శుభగ్రహము లగు- చంద్ర, బుధ, గురు, శుక్రులు, లగ్నమందుండిన జన్మించినస్త్రీ - ధనవస్త్రసౌఖ్యములతోగూడియుండును. పాపగ్రహము లగు రవ్యంగారక శని రాహు కేతువులు- లగ్నమందుండిన జన్మించినస్త్రీ- ధనవస్త్రసౌఖ్యహీనురాలగును. (౨౫)

శ్లో॥ యదా శశీ శుక్రబుధౌ విలగ్నే త్రయోపి తే జీవసితేందుజాస్స్యుః। అనేకధా సౌఖ్యగుణాదియుక్తా నారీ చ దాసీభి రలంకృతా సా॥ ౨౬॥

తా॥ లగ్నమందు చంద్రబుధ శుక్రులుగాని బుధగురుశుక్రులుగాని యుండిన, సౌఖ్య సద్గుణాధిక్యములు కలిగి, దాసీలచే సేవింపఁబడునదియగును. (౨౬)

శ్లో॥ క్రోధాన్వితా సౌఖ్యపరా సితేంహ లగ్నస్థితే కాఞ్చనసంయుతా చ। బుధే కలాఢ్యా సుఖభావయుక్తా గుణై ర్యుతా శుక్రగురూ తథైవ। ౨౭॥

తా॥ చంద్రశుక్రులు లగ్నమందుండిరేనిక్రోధము, సౌఖ్యమునందాసక్తి,స్వర్ణాభరణములునుగలిగియుండును. బుధుడుగాని, గురుశుక్రులుగాని యుండిన,శిల్పజ్ఞానము,సౌఖ్యమునందాసక్తి, సద్గుణములునుకలిగియుండు.

శ్లో॥ చాంద్రచంద్రసితా లగ్నే బహుసౌఖ్యసుతాన్వితా।
జీవే లగ్నేఽతిసంపన్నా పుత్రమిత్రసుఖై ర్యుతా॥ ౨౮॥

తా॥ లగ్నమున బుధ చంద్ర శుక్రులుండిరేని సౌఖ్యము, పుత్రసంపత్తియుగలిగియుండును. లగ్నమునందు గురువుండినఅధికభాగ్యము, పుత్రపౌత్రసంపత్తియు గలిగియుండు. (౨౯)

శ్లో॥ సౌమ్యక్షేత్రోదయేచంద్రే సార్ధం శుక్రేణ సంస్థితే।
సుఖాన్వితా పతిద్వేషీ నిత్యం తు స్వైరచారిణీ॥

తా॥ బుధక్షేత్రములగు కన్యామిథునములలో నొకటిలగ్నమైదానియందు చంద్రశుక్రులుండఁగాజన్మించిన స్త్రీ- సుఖము, మగనితోకలహించుస్వభావము, యథేచ్ఛాసంచారమును గలిగియుండు, (౩౦)

శ్లో॥ రిక్తై ర్బుధేజ్యభృగుజై రవిజే చ మధ్యే
శేషై ర్బలేనసహితై ర్విషమే చ లగ్నే
జాతా భవే త్పురుషిణీ యువతి స్సదైవ
పుంశ్చేష్టితా విచరతి ప్రథితా చ లోకే॥ ౩౧॥

తా॥ బుధ గురు శుక్రులు, బలహీనులుగను, శనిమధ్యమబలుఁడుగను, మిగిలినట్టిరవిచంద్రకుజులుబలవంతులుగనుండి బేశిరాశిలగ్నమైయుండఁగా జన్మించిన స్త్రీ- పురుషస్వభావము, పురుషచేష్టలు కలిగి భూమియందు ప్రసిద్ధురాలుగనుండు. (పురుషిణి" అనగా, అనేకపురుషసంబంధము కలదియగునని కొందరందురు). (౩౧)

శ్లో॥ బలిభిర్బుధగురుశుక్రైశ్శశాంకసహితైర్విలగ్నకేసమభే।
స్త్రీబ్రహ్మవాదినీస్యా దనేకశాస్త్రకుశలా చ విఖ్యాతా॥

తా॥ బుధ గురు శుక్రులలో నొకఁడుఏరాశియందైనబలవంతుడై చంద్రసహితుఁడై యుండి సమరాశిలగ్నమైయుండఁగా జన్మించిన స్త్రీ బ్రహ్మజ్ఞానముగలదియు,అనేకవిద్యాకౌశల్యముగలదియులోక ప్రసిద్ధురాలునగును.



పాపద్వయమధ్యగతే చంద్రేలగ్నేచకన్యకాజాతా।
నిజపితృకులే సమస్తం శ్వశురకులం హన్తి నిశ్శేషమ్॥ ౩౩॥

తా॥ ఇరుప్రక్కలరాసులయందుపాపగ్రహములుండిమధ్యరాశియందు, చంద్రుడుండినను మధ్యరాశి జన్మలగ్నమయ్యుండినను జన్మించిన స్త్రీకి, పితృకులమునందె సమస్తక్రియలు జరగును. మఱియునాకన్యకమామగారియొక్క కులమును నిశ్శేషముగ నశింపజేయు. (౩౩)

శ్లో॥ రిపుక్షేత్రస్థితౌ ద్వౌతు లగ్నేయత్ర శుభగ్రహః।
క్రూరశ్చైక స్తత్ర జాతా భవేత్ స్త్రీ విషకన్యకా ॥౩౪॥

తా॥ ఆఱవయింటిలో రెండుగ్రహములు, లగ్నమునందొకపాపగ్రహము, శుభగ్రహమును ఉండఁగాబుట్టినకన్య విషకన్యయగును. (౩౪)

శ్లో॥ భద్రా తిథి ర్యదా శ్లేషా శతభం కృత్తికా తథా।
మందారరవివారా శ్చే ద్విషకన్యాబుధై స్స్మృతా॥

తా॥ ౨-౭-౧౨- ఈతిథులు, ఆశ్లేష, శతభిషము, కృత్తిక, యీనక్షత్రములు. శని, భౌమ, ఆదిత్య వారములు నివిక్రమముగకూడియుండఁగాఁబుట్టిన స్త్రీ విషకన్యయగును. (౩౫)

శ్లో॥ ద్వాదశీ వారుణ స్సూర్యే విశాఖాసప్తమీ కుజే।
మందే ద్వితీయాశ్లేషా చ విషయోగాస్త్రయోమతాః॥

తా॥ ద్వాదశి - శతభిషము, ఆదివారము (౧) సప్తమి, విశాఖ, మంగళవారము (౨) ద్వితీయ,ఆశ్లేష, శనివారము (౩) ఈమూడును విషకన్యాయోగములు. (౩౬)

శ్లో॥ లగ్నేందూ చరరాశౌ కేంద్రస్థాః పాపినో బలినః।
యోషిద్గ్రహసందృష్టా గచ్ఛతి పతిద్వయం నారీ॥ ౩౭॥

తా॥ లగ్నము చరమై, చరరాశియందు చంద్రుఁడుండి యాలగ్నచంద్రులు - స్త్రీగ్రహములచేత చూడబడుచుండి బలవంతులైన పాపగ్రహములు కేంద్రమునందుండఁగాఁబుట్టిన స్త్రీ ఇద్దఱుపతులఁ జెందు.

శ్లో॥ మందే చరే చంద్రయుతేథ ఽదృష్టే శుక్రేణ లోలశ్చ
పతి స్తు తస్యాః। చరస్వభావ శ్చపలోనితాంతం పరస్య
జాతం స్వవివేకహీనం॥ ౩౮॥

తా॥ చరరాశియందు శని చంద్రసహితుఁడై యుండిశుక్రునిచేతచూడఁబడుచుండఁగాఁబుట్టిన స్త్రీయొక్కభర్త అన్యస్త్రీలోలుఁడుగను. ఎల్లపుడుచంచలబుద్ధి గలవాఁడుగను, ఇతరునికుద్భవించినవాఁడుగను, మూర్ఖుడుగ నుండు. (౩౮)

శ్లో॥ సమరాశిగతేచైవ సప్తమే శుభసంయుతే।
శుభగ్రహై స్తథాదృష్టే రాజపూజ్యశ్శుభస్స్మృతః॥ ౩౯॥

తా॥ శని సమరాశియందుండి సప్తమస్థానము శుభగ్రహయుక్తముగఁగాని, శుభగ్రహముచేఁజూడఁబడిగాని యుండఁగాఁబుట్టినకన్యకయొక్కభర్త రాజపూజ్యుఁడుగ, మంగళకరుఁడుగనుండు. (౩౯)

శ్లో। కామస్థౌ శశిశుక్రౌ చే త్తస్యా వృద్ధో భవే త్పతిః।
బాల్యే వైధవ్య మాప్నోతి పాపా స్సప్తమగా యది॥

తా॥ చంద్రశుక్రులు సప్తమస్థానమందుండఁగా జన్మించిన స్త్రీకి ముసలివాఁడు పెనిమిటియగును. సప్తమస్థానమునందు పాపగ్రహములుండునపుడు ౹ బాల్యమునందె విధవయగును. (౪౦)



శ్లో॥ అస్తగేఽర్కేఽరిభి ర్దృష్టే భర్త్రీత్యక్తాచ సాభవేత్।
సప్తమస్థే కుజేతద్వ ద్బాల్యే సా విధవా భవేత్॥

తా॥ సప్తమస్థానమున సూర్యుఁడుండి శత్రుగ్రహముచేఁజూడఁబడుచుండగాఁబుట్టిన స్త్రీ పెనిమిటిచేవిడువఁబడును. మఱియు ఆసప్తమస్థానమందు అంగారకుడుండి శత్రుగ్రహములచేఁజూడఁబడుచుండిన బాల్యమునందె విధవయగును. (౪౧)

శ్లో॥ మందే సప్తమరాశిస్థె తదా శత్రునిరీక్షితే।
కన్యాయాం విధవా భూత్వా జరా మపి చ గచ్ఛతి॥

తా॥ శని సప్తమస్థానమందుండి శత్రుగ్రహములచేఁజూడఁబడుచుండఁగా జనించినకన్యబాల్యమునందు వైధవ్యమును జెంది ముసలితనమును పొందును. (౪౨)

శ్లో॥ ద్యూనే శుభాశుభై ర్యుక్తే పర భర్తృరతాభవేత్।
అస్తగా వారమందా చే త్పాపక్షే విధవా భవేత్॥

తా॥ సప్తమస్థానమున శుభపాపగ్రహములుకూడియుండు నపుడు జనించిన స్త్రీ -పరపురుషాసక్తురాలగును. సప్తమస్థానము పాపస్థానంబై దానియందు కుజశనులుండునపుడు విధవయగును. (౪౩)

శ్లో॥ వ్యయాష్టగే కుజే క్రూరయుతే రాహౌచలగ్నగే।
రండా థలగ్నగేసూర్యేభౌమే వా దుర్భగా భవేత్॥

తా॥ అంగారకుఁడు,పాపగ్రహయుక్తుఁడై ద్వాదశమునందుఁగాని అష్టమమందుఁగాని యుండి, లగ్నమందు రాహువుండునపుడు జనించిన స్త్రీ రండయగును. లగ్నమందు రవికుజులలో నొకఁడుండఁగా దరిద్రురాలగును. ౪౪॥

శ్లో॥ మూర్తౌ రాహ్వర్కభౌమేషు రండా భవతి కామినీ॥
ఏషః శుక్రద్వితీయేషు పతి మన్యం చికీర్షతి॥ ౪౫॥

తా॥ లగ్నమునందు రవి, కుజ, రాహువులుండఁగాజన్మించిన స్త్రీ రండయగును. ఈరవికుజరాహువులు శుక్రునితోఁజేరిలగ్నమందుండిన అన్య పతియందాసక్తురాలగును. ౪౬॥

శ్లో॥ పాపేష్టమే విధవతా నిధనాధిపతి ర్నవాంశకే యస్య।
తస్యదశాయాంమరణం వాచ్యం తస్యాశ్శుభైర్ద్వితీయస్థైః॥

తా॥ జన్మలగ్నమున కష్టమస్థానమునందు, పాపగ్రహముండెనేని ఆయష్టమస్థానాధిపతి యేగ్రహముయొక్క నవాంశయందుండునో యాగ్రహము, వివాహానంతరము, అంతర్దశాధిపతియైనప్పుడు వైధవ్యము సంభవించును. శుభగ్రహములు ద్వితీయస్థానమునందును పాపగ్రహము అష్టమస్థానమునందునుండఁగాజన్మించిన స్త్రీ భర్తకంటెముందరనె మృతిజెందును.

శ్లో॥ రంధ్రస్థానేస్థితే క్రూరే జాతా వైధవ్య మాప్నుయాత్।
అష్టమస్థానగే పాపే కుంభస్థేఽథ శుభగ్రహే॥
యా కన్యా జాయతే సా తు భర్తుః పూర్వం మరిష్యతి॥

తా॥ అష్టమస్థానమునందు పాపగ్రహముండునపుడు జన్మించిన స్త్రీ విధవయగును. మఱియు నాయష్టమ స్థానమునందొక పాపగ్రహము, కుంభరాశియందొక శుభగ్రహముండగా జన్మించినస్త్రీభర్తకంటె ముందుగానే మృతిజెందును. ౪౭॥

శ్లో॥ యదా శుభాః క్రూరఖగా విలగ్నా ద్వితీయగ శ్శో
భనఖేచర స్తు। సా భర్తు రగ్రే మ్రియతే చ నారీ
గోసింహకౌర్పేన్దుగతేఽల్పపుత్రా॥ ౪౮॥



తా॥లగ్నమునందు శుభాశుభగ్రహములును, ద్వితీయస్థానమందు శుభగ్రహంబునుండఁగా జన్మించిన స్త్రీభర్తకంటెముందుగామృతినొందును-వృషభ, సింహ, వృశ్చికరాసులయందు చంద్రుఁడుండఁగాఁబుట్టిన స్త్రీ అల్పసంతానము కలదియగును. ౪౮॥

శ్లో॥ క్రూరే జామిత్రగతే నవమేయది ఖేచరో భవతినూనం
ప్రవ్రజ్యా భవతి తదా పాపగ్రహసంభవాదబలా ॥౪౯॥

తా॥ సప్తమస్థానమునందును నవమస్థానమునందును పాపగ్రహములుండఁగాఁబుట్టినస్త్రీ సన్యసించును. ౪౯॥

శ్లో॥కన్యాళివృషభేసింహేశశిరమ యూథేఽల్పపుత్రతా తస్యాః।
పుత్రభవనే శుభయుతే నిరీక్షితే తన్నైవ స్యాత్॥

తా॥ కన్యా వృశ్చిక,వృషభ, సింహ రాసులయందుచంద్రుండుండినను, పంచమస్థానము శుభగ్రహయుతమైగాని శుభగ్రహముచే చూడబడిగానియుండినను జనించినస్త్రీ అల్పసంతానముకలదియగు. ౫౦॥

శ్లో॥ మందారౌ చ విలగ్నస్థౌ శశిశుక్రౌ యథాతథా।
వంధ్యా భవతి సా నారీ పంచమే పాపదృగ్యుతే॥ ౫౧॥

తా॥లగ్నమునందు శని కుజులుగాని చంద్రశుక్రులుగానియుండి పంచమస్థానముపాపగ్రహముతోఁగూడిగాని పాపగ్రహముచేఁజూడఁబడిగానియుండఁగాఁబుట్టినది, గొడ్రాలగును. ౫౧॥

శ్లో॥ శనిభౌమగృహే లగ్నే చంద్రే చ సితసంయుతే।
పాపదృష్టేఽథ సా నారీ వంధ్యాత్వ ముపగచ్ఛతి॥ ౫౨॥

తా॥ మేష వృశ్చిక, మకర కుంభములలోనొకటిజన్మలగ్నమై చంద్రుఁడు శుక్రునితోఁగూడియుండి పాపగ్రహముచేఁజూడఁబడుచుండఁగా జన్మించినది గొడ్రాలగును. ౫౨॥

శ్లో॥ రంధ్రగా మందసూర్యా చే ద్విలగ్నా న్నిజరాశిగా।
వంధ్యా చ చంద్రజ శ్చంద్రః కాకవంధ్యా తథాభవేత్ ॥

తా॥ రవి శనులు అష్టమస్థానమునందు గాని లగ్నముకం టెమ తియొక రాశి వారలకు స్వక్షేత్రమై దానియందుగాని యుండునపుడు జన్మించిన స్త్రీ గొడ్రాలగును - బుధచంద్రులు పై జెప్పఁబడిన ప్రకారముండగా జన్మించినది కాకవంధ్యయగును. ౫౩॥

శ్లో॥ మృతాపత్యా చ శుక్రే జ్యా సారా గర్భస్రవా భవేత్।
తస్యా జ్జన్మని చింతాయాం రంధ్రభవ్యం గ్రహాన్వితం॥

తా॥ గురుశుక్రులు పైఁజెప్పఁబడిన ప్రకారముండునపుడు మృత సంతానముకలదియగును - వీరలు అంగారకునితోఁజేరి పైఁజెప్పఁబడిన ప్రకారముండునపుడు జన్మించినది గర్భస్రావముగలదియగును. ౫౪॥

శ్లో॥ సప్తమస్థః కుజ శ్చైవ దృష్ట స్సౌరేణ సోపిచేత్।
గళద్గర్భా తు సా జ్ఞేయా శనౌ రోగయుతప్రజా॥ ౪౫॥

తా॥ సప్తమస్థానమునందు అంగారకుడుండి శనిచేతజూడబడుచుండగా జన్మించినది గర్భస్రావముకలదియగును. సప్తమస్థానమునందు శని యుండి అంగారకునిచేఁ జూడఁబడుచుండఁగా జన్మించిన స్త్రీ రోగయుక్త సంతానముకలదియగును. ౫౫॥

శ్లో॥ రవౌ మృతప్రజా జ్ఞేయా రాహుణాపి తథైవచ।
చంద్రే బుధే చ సా నారీ కన్యాజన్మవతీ భవేత్ ॥౪౬॥

తా॥ సప్తమస్థానమునందు సూర్యుఁడు రాహుయుక్తుఁడై యుండగాఁబుట్టిన స్త్రీ మృతప్రజగలదియగును. చంద్ర బుధులుండఁగా జన్మించిన స్త్రీ స్త్రీసంతానముకలదియగును. ౫౬॥

శ్లో॥ పంచమస్థౌ గురుసితౌ బహుపుత్రయుతా భవేత్।
సుభగా పతిపూజ్యా సా గుణయుక్తా చ సువ్రతా॥ ౪౭॥



తా॥ పంచమస్థానమునందు గురుశుక్రులుండఁగా జన్మించిన స్త్రీ అనేకపుత్రులు, సౌభాగ్యము, పతిపూజ, సద్గుణములు, మంచివ్రతములును గలదిగనుండును. ౫౭॥

స్త్రీడింభచక్రము.

శ్లో॥ నారిచక్రే మస్తకే త్రీణి భాని
వక్త్రే భానాం సప్తకం స్థాపనీయం।
ప్రత్యేకం స్యు ర్వేదతారా పురో జే
తిస్ర స్తారా హృత్ప్రదేశే నివేశ్యాః॥ ౪౮॥
నాభౌ దేయం భత్రయం త్రీణి గుహ్యే
పాదద్వంద్వే చైవ చత్వారి భాని।
యోషిచ్చక్రే కల్పయే దుక్తరీత్యా
భానోర్ధిష్ణ్యా చ్చంద్రధిష్ణ్యావధిస్థం॥ ౪౯॥
స్యా త్సంతాప శ్శీర్షభై ర్వక్త్రసంస్థై
ర్నిత్యం మృష్టాన్నాది సౌఖ్యోపలబ్ధిః।
కామంస్వామి ప్రేమవృద్ధి స్తనస్థై
ర్వక్షోదేశావస్థితై రేవ హర్షః॥ ౫౦॥
పత్యుశ్చింతానందవృద్ధి శ్చ నాభౌ
గుహ్యస్థై స్స్యా న్మన్మథాధిక్య ముచ్చైః।
పాదద్వంద్వే భామినీ చాతిదుష్టా
పత్యుశ్చింతా మందవిక్షోభిణీ చ॥ ౫౧॥

తా॥ స్త్రీప్రతిమను వ్రాసి సూర్యుడున్న నక్షత్రము మొదలు చంద్రుడున్న నక్షత్రమువఱకు శిరస్సు మొదలు పాదపర్యంతము క్రమముగ నిరువదియేడు నక్షత్రములు వ్రాయవలయు. ఎట్లనఁగా—శిరమునందు ౩ నక్షత్రములు, ముఖమునందు ౨, స్తనములయందు ౪, హృదయమునందు ౩, నాభియందు ౩, యోనియందు ౩, పాదములయందు ౪, వ్రాయవలయు. జన్మించిన స్త్రీయొక్క నక్షత్రము శిరస్సునందుండిన, సంతాపము, ముఖమునందుండిన మృష్టాన్నము మొదలగువానివలన సౌఖ్యము, స్తనములయందుండిన పతియందనురాగము, హృదయమునందుండిన మిక్కిలి సంతోషము, నాభియందుండిన పతిచింత, సంతోషము, యోనియందుండిన అతికామము, పాదములయందుండిన అతిదుష్టత్వము, పతిచింత, మందమయిన క్షోభంబును గలుగును. ౬౧॥

శ్లో॥ జన్మకాలే వివాహే చ చింతాయాం వరణే తథా।
చింత్యం స్త్రీణాం తు జన్మోక్తం ఘటంతే తత్పతిష్వపి॥

తా॥ ఈప్రకారము స్త్రీలకు ఫలము జననకాలమందును వివాహకాలమందును, కన్యావరణకాలమునందును, ప్రశ్నకాలమునందును చింతించవలయు. మఱియు నీఫలములను స్త్రీ యొక్క పతికిఁగూడఁ జెప్పనగును.

ఇతి శ్రీవృద్ధయవనే స్త్రీజాతకే త్రింశాంశాదిఫలాధ్యాయః.

---

## లగ్నఫలాధ్యాయము.

శ్లో॥ మేషోదయే సత్యపరానృశంసా నారీ భవేత్క్రోధగతా
సదైవ। శ్లేష్మాధికా నిష్ఠురవాక్ప్రయుక్తా సదానురక్తా
నిజబంధువర్గే॥ ౧॥

తా॥ మేషలగ్నమున జన్మించిన స్త్రీ, సత్యభాషణము, క్రూరస్వభావము, శ్లేష్మాధిక్యము, నిష్ఠురవాక్యములు, బంధుప్రీతియు గలదిగనుండును.



శ్లో॥ వృషోదయే సస్వరతా మనోజ్ఞా వినీతచేష్టా పతివల్లభా చ।
నారీ భవేత్సర్వకలాసుదక్షా స్వవర్గరక్తా పతివాక్యఇష్టా।

తా॥ వృషభలగ్నమునందు జనించిన స్త్రీ పైరులయందాసక్తి, మనోహరత్వము, సవినయవ్యాపారము, పతి స్వాధీనముగనుండుట, సమస్తశిల్పవిద్యలయందు సామర్థ్యము, బంధువర్గమునందుప్రీతి, పతివాక్యమునందిష్టంబును కలదిగనుండును. ౨॥

శ్లో॥ తృతీయలగ్నే ఽతికఠోరవాక్యా స్త్రీ కామసక్తా గుణ
వర్జితా చ। సదా నృశంసా కఫవాతయుక్తా మహావ్య
యా క్రూరవిచేష్టితా చ॥ ౩॥

తా॥ మిథునలగ్నమునందు జనించిన స్త్రీ, అతికఠోరవాక్యము, అతికామము, దుర్గుణములు, సదాక్రూరస్వభావము, కఫయుక్త వాతరోగము, ధనవ్యయము. క్రూరమైనచేష్టలును కలదిగనుండును. ౩॥

శ్లో॥ లగ్నే కుళీరే చ భవేత్ప్రసూతా నారీ సురూపార్థ
నయైస్సమేతా। బంధుప్రియా సాధుసుశీలదక్షా ప్ర
భాన్వితా సాధుసుఖైస్సమేతా॥ ౪

తా॥ కటకలగ్నమందు జనించిన స్త్రీ - విశేషసంతానము, సౌందర్యము, ధనము, నీతి, బంధుప్రేమ, సాధుత్వము, సౌశీల్యము, కాంతి, సుఖంబును కలదిగనుండును. ౪॥

శ్లో॥ సింహస్య లగ్నే వనితా ఽతితీక్ష్ణా భవేత్కఫాఢ్యా కల
హప్రియా చ। నానామిషైర్దుష్టశరీరయుక్తా పరోపకా
రే నిరతా సదైవ॥ ౫॥

తా॥ సింహలగ్నమునందు జనించిన వనిత - కోపము, కఫాధిక్యము, కలహాసక్తి, నానావిధమాంసభక్షణచే దుష్టమయినశరీరము, ఎల్లపుడు పరోపకారమునందాసక్తియు గలదిగనుండును. ౫॥

శ్లో॥ కన్యోదయే యా వనితాఽభిజాతా సౌభాగ్యసౌఖ్యై
స్సహితా హితా చ। భవే త్సువర్గా బహుధర్మరక్తా జి
తేంద్రియా సర్వకలాసు దక్షా॥ ౬॥

తా॥ కన్యాలగ్నమందు జనించినవనిత- సౌభాగ్యము, సౌఖ్యము, సౌశీల్యము, మంచిపరివారము, మిక్కిలి ధర్మమునం దనురక్తి, ఇంద్రియనిగ్రహము, సమస్త శిల్పవిద్యలయందు సామర్థ్యంబును, కలదిగనుండును

శ్లో॥ లగ్నే తులాయాం చిరకాలకృత్యా భవే త్సుమందా ప్ర
ణయేన హీనా। సుగర్వితా క్షాంతి వివర్జితా చ తృ
ష్ణాధికా నీతివివర్జితా చ॥ ౭॥

తా॥ తులాలగ్నమునందు జనించిన కన్యక- శాశ్వతవ్యాపారము, అతిమాంద్యము, స్నేహములేకపోవుట, గర్వము, ఓర్వలేమితనము, అధికాశ, నీతిలేకపోవుట ఇవికలదిగనుండును. ౭॥

శ్లో॥ నారీ భవే ద్వృశ్చికలగ్నజాతా సురూపగాత్రా నయ
నాభిరామా। సుపుణ్యశీలా చ పతిప్రియా చ గుణాధి
కా సత్యపరా సదైవ॥ ౮॥

తా॥ వృశ్చికలగ్నమునందు జన్మించినకన్యక - సుందరమైన శరీరము, నేత్రానందము, పుణ్యస్వభావము, పాతివ్రత్యము, సద్గుణములు, ఎల్లపుడు సత్యమునందే ప్రీతియుగలదిగనుండును. ౮॥

శ్లో॥ చాపోదయే యా వనితాభిజాతా సుబుద్ధిసారా పురు
షానుకారా। సామైకసాధ్యా విధవా కఠోరా నిస్నేహ
చిత్తా ప్రణయేన హీనా॥ ౯॥

తా॥ ధనుర్లగ్నమునందు జనించిన స్త్రీ - మంచిబుద్ధి, పురుషవ్యాపారములు, మంచిమాటలచే స్వాధీనమగుట, క్రూరచేష్టలు, స్నేహహీనచిత్తము, అప్రీతి, ఇవికలదిగానుండును. ౯॥



శ్లో॥ మృగోదయే స్త్రీ సుభగాఽతిసత్యా తీర్థానురక్తా హ
తశత్రుపక్షా। ప్రధానకృత్యా ప్రథితా తు లోకే గుణా
న్వితా పుత్రవతీ సదైవ॥ ౧౦॥

తా॥ మకరలగ్నమునందు జనించిన స్త్రీ- సౌభాగ్యము, సత్యము, తీర్థయాత్రయందుప్రీతి, శత్రునాశము, ముఖ్యకార్యాసక్తి, లోకప్రసిద్ధి, గుణసంపత్తి, విశేషపుత్రసంతానంబును గలదిగనుండు. ౧౦॥

శ్లో॥ కుంభే చ లగ్నే ప్రమదాఽభిజాతా స్త్రీజన్మదక్షా క్షత
జార్దితా చ। ప్రీతి ర్గురూణాం శుచిరుద్ధచేష్టా వ్య
యాధికా పుణ్యపరా కృతజ్ఞా॥ ౧౧॥

తా॥ కుంభలగ్నమునందు జనించినవనిత - జన్మప్రభృతి సామర్థ్యము, కుసుమరోగముచేపీడ, గురువులయందుప్రీతి, పరిశుద్ధత, వ్యాపారముల నడ్డగించుట, అధికవ్యయము, పుణ్యమునందాసక్తి, ఉపకారస్మృతియు గలదిగనుండును. ౧౧॥

శ్లో॥ మీనోదయే స్త్రీ బహుపుత్రపౌత్రా పతిప్రియా బాంధ
వలోకమాన్యా। సునేత్రకేశా సురవిప్రభక్తా నయా
న్వితా ప్రీతిపరా గురూణాం॥ ౧౨॥

తా॥ మీనలగ్నమునందు జన్మించినయువతి- పుత్రులుపౌత్రులు, పతియందుప్రీతి, బంధుజనముచేపూజింపబడుట, అందముగనుండు నేత్రములు, కేశములు, దేవబ్రాహ్మణులయందు విశ్వాసము, నీతి, పెద్దలయందు ప్రీతియు గలదిగనుండును. ౧౨॥

ఇతి శ్రీవృద్ధయవనే స్త్రీజాతకే లగ్నఫలాధ్యాయః.

## చంద్రరాశిఫలాధ్యాయము.

శ్లో॥ చంద్రే హ్యజస్థే జనితా ప్రగల్భా జాతా భవేత్కృత్య
పరా ప్రధానా । సురూపగాత్రా పతివల్లభా చ సదా
గురూణాం ప్రణయానురక్తా॥ ౧॥

తా॥ మేషరాశియందు చంద్రుడుండగా జనించిన స్త్రీ కార్యములయందు నైపుణ్యము, కార్యములయం దాసక్తి, ప్రాధాన్యము, సుందరమైన శరీరము, పతియందు ప్రీతి, ఎల్లపుడు గురువులయందు ప్రేమయు గలదిగ నుండును. ౧॥

శ్లో॥ వృషాశ్రితే శీతకరే సుశీలా విద్యావివేకా గమశాస్త్ర
రక్తా । తీర్థప్రసక్తా బహుపుత్రపౌత్రా పతిప్రియా
విత్తపరిగ్రహేణ॥ ౨॥

తా॥ వృషభరాశియందు చంద్రుడుండగా జన్మించిన స్త్రీ మంచి స్వభావము, విద్యావివేకము, ఆగమశాస్త్రములయందు ప్రీతి, తీర్థయాత్రలయందాసక్తి, అనేకపుత్రపౌత్రసంతతి, ధనసంగ్రహణము చేయుటచే పతియందిష్టంబును గలదిగ నుండును. ౨॥

శ్లో॥ నృయుక్స్థితే శీతకరే సుశీలా భవేత్సుకాయా ప్రియద
ర్శనా చ । నానార్థమానై స్సహితా విదగ్ధా పరోప
కారప్రవణా సునేత్రా॥ ౩॥

తా॥ మిథునరాశియందు చంద్రుడుండగా జన్మించిన స్త్రీ, మంచి చరిత్రము, మంచిశరీరము, సౌందర్యము, నానాప్రయోజనములయం దభిమానము, చాతుర్యము, పరోపకారమునం దాసక్తి, మంచినేత్రములును కలదిగ నుండును. ౩॥



శ్లో॥ కర్కిస్థితే శీతకరే రుజార్తా నారీ భవేత్పూజ్యతమా
స్వవర్గే । సుమానినీ బాంధవలోకమాన్యా హతారిప
క్షా ద్విజదేవభక్తా॥ ౪॥

తా॥ కర్కాటకరాశియందు చంద్రుడుండగా జనించిన స్త్రీ రోగములచేపీడ, స్వవర్గమునందు పూజ్యత, మానము, బంధువర్గమునందు పూజ్యత, శత్రుజయము, దేవబ్రాహ్మణులయందు విశ్వాసంబును గలదిగ నుండు

శ్లో॥ సింహస్థితే చంద్రమసి ప్రధానా నారీ భవేత్సౌమ్యసమ
న్వితా చ । ప్రియామిషా భూషణవస్త్రభాజా ఉదారచే
ష్టా సుభగా సురూపా॥ ౫॥

తా॥ సింహరాశియందు చంద్రుడుండగా జనించిన స్త్రీ స్వవర్గమునందు ప్రాధాన్యము, సౌమ్యత, మాంసమునందు ఆసక్తి, వస్త్రాభరణములు, గొప్పవ్యాపారములు, సౌభాగ్యము, మంచిరూపంబును గలదిగ నుండు.

శ్లో॥ కన్యాశ్రితే శీతకరే తు జాతా నారీ భవేద్విత్తచతుష్ప
దాఢ్యా । పతిప్రధానా జితశత్రుపక్షా క్షమాన్వితా
శౌచపరా సదైవ॥ ౬॥

తా॥ కన్యారాశియందు చంద్రుడుండగా జనించినస్త్రీ సంపూర్ణమైన గోధనములు, పాతివ్రత్యము, శత్రుజయము, ఎల్లప్పుడు ఓర్పు, సదాచారంబును గలదిగ నుండు. ౬॥

శ్లో॥ తులాధరస్థే శశిని వ్రతాఢ్యా జాతా భవేత్ స్త్రీ హి
తబంధువర్గా । పతివ్రతా పుత్రవతీ మనోజ్ఞా వివర్జితా
డంభమనోభవాభ్యాం॥ ౭॥

తా॥ తులారాశియందు చంద్రుడుండగా జనించిన స్త్రీ, వ్రతములయం దాసక్తి, బంధుసమాజమునందు ప్రీతి, పాతివ్రత్యము, పుత్రులు, మనోహరత్వము, ప్రతిష్ఠ, అతికామము లేకుండుటయు గలదిగ నుండు. ౭॥

శ్లో॥ చంద్రేఽళిసంస్థే తు సుగుప్తపాపా స్థిరస్వభావా సుపి
దగ్ధచేష్టా । ప్రియా గురూణాం నియమైస్సమేతా ప్ర
భూతకోశా విగతాభిమానా॥ ౮॥

తా॥ వృశ్చికరాశియందు చంద్రుడుండగాజనించిన స్త్రీ-తానుచేసిన పాపమును బయలుపఱచకుండుట, స్థిరమైనస్వభావము, చతురమైన పనులు, పెద్దలకుప్రీతికలుగచేయుట, వ్రతనియమములు, విస్తారమయినభాగ్యము, అభిమానహీనతయు గలదిగనుండు. ౮॥

శ్లో॥ ధనుర్ధరస్థే శశిని ప్రతాఢ్యా నారీ భవేద్దానపరా స
రాగా । గీతప్రియా ప్రాణహితానుకూలా ప్రియాగ
మా స్త్రీజననీ వినీతా॥ ౯॥

తా॥ ధనూరాశియందు చంద్రుడుండగా జనించిన స్త్రీ-వ్రతనియమములయందు ఇచ్ఛ, దానములయందు ఆసక్తి, అనురాగము, గానాసక్తి, ప్రాణులయందు ప్రీతి, ఆనుకూల్యము, ఇష్టప్రాప్తి, స్త్రీసంతతి- వినయంబును గలదిగనుండును. ౯॥

శ్లో॥ చంద్రే మృగస్థే వికరాలదంష్ట్రా నారీ భవేత్పూర్వప
రా మనోజ్ఞా । విద్యాధికా సత్యపరా సురూపా సుసం
యతా నీతిపరా హతారిః॥ ౧౦॥

తా॥ మకరరాశియందు చంద్రుడుండగా జనించిన స్త్రీ- భయంకరమైనదంతములు, సూర్యభక్తి, మనోహరత్వము, అధికవిద్యలు, సత్యమునందాసక్తి, మంచిరూపము, ఇంద్రియనిగ్రహము,నీతి, శత్రుజయంబును గలదిగనుండును. ౧౦॥

శ్లో॥ ఘటాశ్రితే శీతకరే తు జాతా నారీ భవేచ్చంద్రస
మానవక్త్రా । సుదానశీలా సుతవిత్తయుక్తా శుభాన్వితా
ప్రథితాభిమానా॥ ౧౧॥



తా॥ కుంభరాశియందు చంద్రుడుండగా జనించిన స్త్రీ - చంద్రునితోసమానమైన ముఖము, దానముచేయు స్వభావము, పుత్రులు, ధనము, మంగళకరక్రియలు, ప్రసిద్ధి, అభిమానంబును గలదిగనుండు. ౧౧॥

శ్లో॥ మీనాశ్రితస్థే హిమగౌ సుతాఢ్యా నారీ భవేద్ధర్మపరా
సుశీలా। జితేంద్రియా సర్వకలాసు దక్షా లజ్జాన్వితా
మానపరా మనోజ్ఞా॥ ౧౨॥

తా॥ మీనరాశియందు చంద్రుడుండగా జనించిన స్త్రీ-పుత్రసంతతి, ధర్మమునందు ఆసక్తి, మంచిస్వభావము, ఇంద్రియనిగ్రహము, సమస్తమైన శిల్పవిద్యలయందు సామర్థ్యము, సిగ్గు, మానమునందాసక్తి,మనోహరత్వంబును గలదిగనుండును. ౧౨॥

ఇతి శ్రీవృద్ధయావనే స్త్రీజాతకే చంద్రరాశిఫలాధ్యాయః.



## నక్షత్రఫలాధ్యాయము.

శ్లో॥ జాతాఽశ్వినీతు ప్రమదా మనోజ్ఞా ప్రభూతకోశా ప్రి
యదర్శనా చ । ప్రియంవదా సర్వసహాభిరామా శుద్ధా
న్వితా దేవగురుప్రసక్తా॥ ౧॥

తా॥ అశ్వినీనక్షత్రమునందు జనించినస్త్రీ-మనోహరత్వము, అధికసంపత్తు, ఇష్టమయినదర్శనము. మంచిమాటలు, ఓర్పు, క్రీడయందాసక్తి, పారిశుద్ధ్యము, దేవగురువులయందు భక్తియు గలదిగనుండును.

శ్లో॥ స్త్రీవర్గయుక్తా భరణీషు జాతా భవేన్నృశంసా కల
హప్రియా చ । సుదుష్టచిత్తా విభవైశ్చ హీనా హత
ప్రతాపా సతతం కుచేష్టా॥ ౨॥

తా॥ భరణియందు జనించినస్త్రీ- స్త్రీసమూహము, క్రూరస్వభావము, కలహమునందు ఆసక్తి, దుష్టచిత్తము, దారిద్ర్యము, ప్రతాపహీనత్వము, మలినవస్త్రములును గలదిగనుండును. ॥౨

శ్లో॥ జాతా భవేత్ స్త్రీ త్వథ కృత్తికాసు కోపాధికా యుద్ధ
పరా విరక్తా । ప్రద్వేషిణీ బంధుజనేన హీనా శ్లేష్మాధి
కా క్షామతను స్సదైవ॥ ౩॥

తా॥ కృత్తికానక్షత్రమునందుఁ బుట్టినవనిత- కోపాధిక్యము, కలహమునందు ప్రీతి, వైరాగ్యము, జనులయందు ద్వేషము, బంధువులులేకుండుట, కఫాధిక్యము, కృశించిన శరీరంబును గలదిగనుండును. ౩॥

శ్లో॥ జాతా భవేత్ స్త్రీ త్వథ రోహిణీషు సురూపగాత్రా
శుచి రప్రమత్తా । పతిప్రధానా పితృమాతృభక్తా సుపుత్ర
కన్యా విభవై స్సమేతా॥ ౪॥

తా॥ రోహిణీనక్షత్రమునందుఁ బుట్టినవనిత-సుందరమైన శరీరము, పారిశుద్ధ్యము, జాగ్రత, పతియందు ప్రీతి, తలిదండ్రులయందు భక్తి,యోగ్యమయిన స్త్రీపురుషసంతతి, ఐశ్వర్యంబును గలదిగనుండును. ౪॥

శ్లో॥ మృగే తు మాన్యా వనితా సురూపా ప్రసన్నవాక్యా
ప్రియభూషణా చ । నానార్థవస్త్రాన్నపరా సుపుత్రా
ధర్మాశ్రయా శుద్ధతనుఃప్రసక్తా॥ ౫॥

తా॥ మృగశిరోనక్షత్రమునందుఁబుట్టిన,వనిత - పూజ్యత, సౌందర్యము, ప్రియములనుమాటలు, మంచిభూషణములు, వివిధ వస్త్రాన్నములయందును- ధనమునందును- ఆసక్తి, సుపుత్రులు, ధర్మము సేయుటయందు ఆసక్తి, పరిశుద్ధదేహంబును గలదిగనుండును. ౫॥

శ్లో॥ ఆర్ద్రాసు నారీ సుతమన్యుయుక్తా దుష్టస్వభావా కఫపి
త్తభాక్చ । సురేంద్రభావా పరపక్షరంధ్రా మహావ్య
యా కృత్రిమపండితా చ ॥ ౬॥

తా॥ ఆర్ద్రాయందు జనించినస్త్రీ-పుత్రులు, కోపస్వభావము, దుష్టస్వభావము, పిత్తశ్లేష్మములు, దేవతాభక్తి, శత్రుదోషములను గుర్తెఱుంగుస్వభావము, అధికవ్యయము, కృత్రిమపాండిత్యంబునుగలదిగనుండును. ౬॥



శ్లో॥ పునర్వసౌ దంభవిహీనభావా భృత్యాధికా పుణ్యపరా
సుభావా । నారీ భవే ద్ధర్మపరా మనోజ్ఞా సుపూజి
తా నాథవతీ స్సదైవ ॥ ౭॥

తా. పునర్వసునక్షత్రమునందుఁ బుట్టినకన్యక-గర్వములేకుండుట, భృత్యవర్గము, పుణ్యమునందాసక్తి, మంచిస్వభావము, ధర్మము,మనోహరత్వము, పూజ్యత, సుందరుడగుపతియు గలదిగనుండును. ౭.

శ్లో॥ పుష్యేషు జాతా వనితా సురూపా ప్రసిద్ధకృత్యా సుభ
గా సుపుత్రా । దేవద్విజార్థే ప్రవణా సుహర్మ్యా సుఖా
ధికా బాంధవవల్లభా చ ॥ ౮॥

తా. పుష్యమి నక్షత్రమునందుఁ బుట్టిననారి- సౌందర్యము, గొప్పపనులు, సంపత్తు, సుపుత్రులు, దేవబ్రాహ్మణభక్తి, మంచిమిద్దెలుగల యిండ్లు, అధికసౌఖ్యము, బంధువులయందుప్రీతియు గలదిగనుండును. ౮.

శ్లో॥ సార్పే కురూపా వ్యసనాభిభూతా క్రియావిహీనాఽతి
కఠోరవాక్యా । నారీ భవే త్సర్వవిహీనకృత్యా దంభా
న్వితా ఛద్మరతా కృతఘ్నా॥ ౯॥

తా. ఆశ్లేషానక్షత్రమునందుఁ బుట్టిననారి- వికారరూపము, వ్యసనము, ధర్మాదిక్రియావిహీనత, కఠోరవుగుభాషణము, లోకనిందితవ్యాపారము, గర్వము, కపటము,చేసినయుపకారమమరచుటయుగలదియగు. ౯

శ్లో॥ మఖాసు మాన్యా బహుశత్రుపక్షా శ్రియాధికాపాపవివ
ర్జితా చ । భక్తా గురూణాం ప్రణతా ద్విజానాం నారీ
భవే త్పార్థివసౌఖ్యయుక్తా॥ ౧౦॥

తా॥ మఖానక్షత్రమునందుఁబుట్టిన స్త్రీ - పూజ్యత, శత్రుపక్షము, అధికసంపద,పుణ్యము,గురుబ్రాహ్మణభక్తి,రాజసౌఖ్యంబును గలదియగు,

శ్లో॥ భాగ్యే జితారి స్సుభగా సుపుత్రా నయాన్వితా స
ద్వ్యవహారదక్షా । శాస్త్రానురక్తా ప్రియవాదినీచ
స్త్రీ ప్రాప్తపుణ్యా హి భవే త్కృతజ్ఞా॥ ౧౧॥

తా॥ పుబ్బనక్షత్రమునందుబుట్టినస్త్రీ-శత్రుజయము, సౌభాగ్యము, సుపుత్రులు,నీతి, సద్వ్యవహారములయందుసామర్థ్యము, శాస్త్రములయందుప్రీతి, ప్రియభాషణము, పుణ్యము, కృతజ్ఞతయు గలదియగు. (౧౧)

శ్లో॥ అర్యమ్ణభే సుస్థిరచిత్తవిత్తా నయప్రధానా గృహకృ
త్యదక్షా । గుణానురక్తా వ్యసనై ర్వియుక్తా నారీ
భవే ద్రోగవివర్జితా చ॥

తా॥ ఉత్తర నక్షత్రమునందుబుట్టినస్త్రీ - స్థిరచిత్తము, ధనము,నీతి,గృహకృత్యములయందు సామర్థ్యము, సద్గుణములయందుప్రీతి, నిర్వ్యసనము, ఆరోగ్యంబునుగలదిగనుండును.

శ్లో॥ హస్తే సుహస్తా శుభనేత్రకర్ణా క్షమాన్వితా శీలధనా
విధిజ్ఞా । భవే న్నితాంతం వనితా సుభాషా మహా
సుఖై ర్వర్ధితగాత్రకా చ ॥ ౧౩॥

తా॥ హస్తనక్షత్రమునందు బుట్టినస్త్రీ - మంచిహస్తములు నేత్రములు కర్ణములును,ఓర్పు, మంచిస్వభావము, ధనము, శాస్త్రజ్ఞానము, మంచికాంతి, సౌఖ్యముచే శరీరవృద్ధియు గలదిగనుండును. (౧౩)

శ్లో॥ చిత్రాసు చిత్రాభరణా సురూపా చతుర్దశీ మేక
తమాం హి హిత్వా। తస్యాం చ కృష్ణే విషకన్యకా
స్యా చ్ఛుక్లే దరిద్రా త్వథ బంధకీ చ ॥ ౧౪॥

తా॥ చిత్రానక్షత్రమునందు జనించినస్త్రీ - చిత్రమయిన ఆభరణములు, సౌందర్యంబును గలదిగనుండును. మఱియు కృష్ణపక్షమునందు



చతుర్దశితిథి తప్ప చిత్రానక్షత్రయుక్తమగు మఱియేయితరతిథియందయినను జనించినస్త్రీయువిషకన్యయగును ఈప్రకారమే శుక్లపక్షమునందు జనించినస్త్రీ దరిద్రురాలు, వ్యభిచారియు నగును. (౧౪)

శ్లో॥ స్వాతీషు సాధ్వీ సతతం సుతాఢ్యా విత్తాధికా సత్య
ధనాఽల్పయాత్రా । నారీ భవే త్కీర్తిసమన్వితా
చ ప్రభూతమిత్రా విజితారిపక్షా॥ ౧౫॥

తా॥ స్వాతీనక్షత్రమునందుబుట్టినస్త్రీ - పాతివ్రత్యము, పుత్రులు, ధనము, సత్యము, స్వల్పసంచారములు, కీర్తి, విశేషమైన స్నేహితులు, శత్రుపక్షజయంబును గలదిగనుండును. (౧౫)

శ్లో॥ భవే ద్విశాఖాసు సువాక్యకోమలా సుకోమలాంగీ
విభవై స్సమేతా । తీర్థానురక్తా వ్రతధర్మదక్షా
రామా భవే ద్బాంధవవల్లభా చ॥ ౧౬॥

తా॥ విశాఖ నక్షత్రమునందు జన్మించినస్త్రీ - మంచివాక్కు, కోమలశరీరము, సంపద, తీర్థయాత్రలయందాసక్తి, వ్రతధర్మములయందాసక్తి, బంధువులయందు ప్రీతియు గలదిగనుండును. (౧౬)

శ్లో॥ మైత్రే సుమిత్రా విగతాభిమానా ప్రసన్నమూర్తిః
ప్రభుతాసమేతా । వినీతవేషాభరణా సుమధ్యా
భక్తా గురూణాం పతినా సదైవ॥ ౧౭॥

తా॥ అనూరాధనక్షత్రమునందుజనించినస్త్రీ - మంచిస్నేహితులు, నిరభిమానము, ప్రసన్నముగనుండు శరీరము, ప్రభుత్వము, వినయముతో గూడినవేషాభరణములు,సుందరమగునడుము,గురువులయందుభక్తి, పతియందు దైవభక్తియు, గలిగియుండును, (౧౭)

శ్లో॥ జ్యేష్ఠాసు రమ్యా వనితా ప్రగల్భా సుచారువాక్యా
వనితాన్వితా చ। ప్రభూతకోశా సుభగా సుతా
ఢ్యా బంధుప్రియా సత్యసమన్వితా చ॥ ౧౮॥

తా॥ జ్యేష్ఠానక్షత్రమునందు జన్మించిన స్త్రీ - మనోహరత్వము, కార్యములయందు నైపుణ్యము, ప్రియసంభాషణము, స్త్రీసమూహము, అధికధనము, సౌభాగ్యము, పుత్రసంపత్తి, బంధువులయందు ప్రీతి, సత్యంబును గలదిగనుండును. (౧౮)

శ్లో॥ మూలేఽల్పసౌఖ్యా విధవా దరిద్రా రోగాభిభూతా
బహుశత్రుపక్షా। నారీ భవేద్బాంధవలోకహీనా
పరాభిభూతా బహునీచకర్త్రీ॥ ౧౯॥

తా॥ మూలనక్షత్రమునందు జనించిన స్త్రీ - అల్పసౌఖ్యము, వైధవ్యము, దారిద్ర్యము, రోగము, శత్రుసమూహము, బంధుహీనత, పరులచేత తిరస్కారము, నీచకృత్యములును గలదిగను, పొట్టిదిగనునుండును. ౧౯॥

శ్లో॥ ఆప్యేఽనుకూలా కులమధ్యముఖ్యా సుపూజ్యకర్మా
ఽతులవీర్యసత్యా। విశాలనేత్రాద్భుతరూపయుక్తా
నారీ భవేత్కీర్తియుతా సదైవ॥ ౨౦॥

తా॥ పూర్వాషాఢానక్షత్రమునందు జనించిన స్త్రీ -అనుకూలత్వము, బంధువులలో శ్రేష్ఠత్వము, సత్కర్మాచరణము, సాటిలేనివీర్యము, సత్యము, విశాలనేత్రములు, సుందరమయినయాకృతి, మంచికీర్తియుగలదియగు.

శ్లో॥ వైశ్వే తుజాతా వనితా మనోజ్ఞా భవేద్ద్వితీయా
ప్రథితా నృలోకే। నానార్థభోగై స్సహితా ప్ర
ధానా సంతుష్టచిత్తా పతివల్లభా చ॥ ౨౧॥



తా॥ ఉత్తరాషాఢానక్షత్రమునందు జనించిన స్త్రీ - మనోహరురాలు, లోకమునందు ప్రసిద్ధురాలు, అనేకవిధములైనభోగములతోఁగూడికొనియుండునది, ప్రధానురాలు, సంతోషముతోఁగూడినచిత్తము కలది, పతికిష్టురాలునగును, (౨౧)

శ్లో॥ ప్రభూతరూపా హరిభే సువిజ్ఞా శాస్త్రానురక్తా ప్ర
చురప్రభావా। స్త్రీ సర్వదా దానరతా సుసత్యా
పరోపకారే ప్రవణా చ నిత్యా॥ ౨౨॥

తా॥ శ్రవణనక్షత్రమునందు జన్మించిన స్త్రీ - మిక్కిలిసౌందర్యము, జ్ఞానము, శాస్త్రమునందు ప్రీతి, ప్రసిద్ధమయినమహిమ, దానమునందాసక్తి, సత్యము, ఎల్లప్పుడుపరోపకారమునందాసక్తియుగలదియగు. ౨౨॥

శ్లో॥ భవేద్ధనిష్ఠాసు కథానురక్తా నారీ ప్రభూతాన్నసువ
స్త్రభాజా। నానార్థదా ప్రాప్తహయా నిషణ్ణా గుణాఢి
కా సద్గుణచేష్టితా చ॥ ౨౩॥

తా॥ ధనిష్ఠానక్షత్రమునందు జనించిన స్త్రీ - కథాశ్రవణమునందాసక్తి, కొరవడనిఅన్నవస్త్రములు, నానావిధపదార్థదానము, అశ్వారోహణము, ప్రశస్తమైనగుణములు, సద్వ్యాపారములునుగలదిగనుండును.

శ్లో॥ భవేత్సదాంతా త్వథ వారుణే భే స్త్రీసమ్మతా పూ
జ్యతమా స్వవర్గే। దేవార్చనశ్రేష్ఠజనానురక్తా సదాహి
తా సర్వకుతూహలానాం॥ ౨౪॥

తా॥ శతభిషనక్షత్రమునందు జన్మించిన స్త్రీ - ఇంద్రియనిగ్రహము, స్త్రీసమ్మతి, బంధువర్గమునందు పూజ్యత, దేవతాపూజ, పెద్దలయందు ప్రీతి, సంతోషకార్యములయందు ప్రీతియు గలదిగనుండును. (౨౪)

శ్లో॥ అజైకపాదే వనితాభిజాతా ప్రభూతకోశా సుతలాలసా చ। సత్పాత్రదా సాధుసమాగమోక్తా విద్యాన్వితా భూరిధనా ప్రధానా॥ ౨౫॥

తా॥ పూర్వాభాద్రనక్షత్రమునందు జనించినస్త్రీ విస్తారమైనసంపద, పుత్రులయందు ప్రీతి, సత్పురుషులకు దానముచేయుస్వభావము, సత్సాంగత్యము, విద్య, విస్తారధనము, ప్రధానత్వంబునుగలదియగు. (౨౫)

శ్లో॥ ఉపాంత్యభే స్వామిహితానురక్తా క్షమాన్వితా ప్రీతికరా గురూణాం। ప్రశాంతగర్వా సుఖసౌఖ్య యుక్తా వివేకినీ కృత్యపరా సదైవ॥ ౨౬॥

తా॥ ఉత్తరాభాద్రనక్షత్రమునందుజనించిన కన్య - పతికిష్టురాలు, పతియందనురాగము ఓర్పునుకలది, గురువులకు ప్రీతికరురాలు, గర్వహీనురాలు, సుఖవంతురాలు, వివేకవంతురాలు, సత్కార్యములయందాసక్తురాలునగును. (౨౬)

శ్లో॥ పౌష్ణే సుపూజ్యా బహుమిత్రపక్షా స్వభావశుద్ధా వ్రతచారిణీ చ। తేజోన్వితా భూరిచతుష్పదాఢ్యా హతారిపక్షా ప్రియదర్శనా చ॥ ౨౭॥

తా॥ రేవతీనక్షత్రమునందు జనించినస్త్రీ - పూజ్యత, మిక్కిలిస్నేహముచేయుస్వభావము, పారిశుద్ధ్యము, వ్రతాచరణము, అధికకాంతి, విస్తారమయినగోసంపద, శత్రుపక్షజయము సౌందర్యంబునుకలదియగును.

ఇతి శ్రీవృద్ధయావనే స్త్రీజాతకే నక్షత్రఫలాధ్యాయః



## భావఫలాధ్యాయము.

### సూర్యభావఫలము.

శ్లో॥ మూర్తౌ రవి స్తీవ్రతరాం ప్రసూతే నారీం తథా తీవ్రరుజాసమేతామ్ దుష్టస్వభావాం సుకృశాం కృతఘ్నాం పరాన్నరక్తాం ప్రభయా విహీనామ్॥ ౧॥

తా॥ లగ్నమున సూర్యుఁడుండగా జనించినస్త్రీ, అతితైక్ష్ణ్యము, ఉష్ణమూలకమైనరోగములు, దుష్టస్వభావము, దేహకృశత్వము, చేసినయుపకారమునుమరచుట, పరాన్నమునందాశ, కాంతివిహీనతయుగలదియగు.

శ్లో॥ ధనాశ్రితేఽర్కే ధనధాన్యహీనాం కఠోరవాక్యాం గతశక్తిభావాం। యుద్ధప్రియాం ద్వేషరతాం ఖలాం చ నారీం ప్రసూతే గతసౌహృదాం చ॥ ౨॥

తా॥ ద్వితీయస్థానమునందు సూర్యుడుండిన - ధనధాన్యవిహీనత, కఠినమైనవాక్కు, బలహీనత, కలహమునందు ప్రీతి, ద్వేషించుటయందిచ్ఛ, దౌర్జన్యము, స్నేహహీనత, యివికలదిగనుండును. (౨)

శ్లో॥ తృతీయగ స్తీక్ష్ణకరః ప్రసూతే సుఖేన యుక్తాం వనితాం సదైవ। అరోగదేహాం శుభరూపవక్త్రాం విశాలవక్షాం జనితాం నితాంతమ్॥ 3॥

తా॥ తృతీయస్థానమునందు సూర్యుడుండిన నెల్లప్పుడుసౌఖ్యము, రోగహీనమయినదేహము, సౌందర్యము, సుందరమైనముఖము, విశాలముగనుండు వక్షఃస్థలంబును గలదిగనుండును. 3)

శ్లో॥ చతుర్థగ స్తీక్ష్ణకరః ప్రసూతే సౌఖ్యేన హీనాం వనితాం సదైవ। సరోగదేహాం వికరాలదంష్ట్రాం ప్రభావిహీనాం జనతాపయుక్తామ్॥ ౪॥

తా॥ చతుర్థస్థానమునందు సూర్యుడుండిన - అసౌఖ్యము, రోగయుక్తమయినదేహము, భయంకరమైనదంతములు, కాంతివిహీనత, జనసంతాపకరస్వభావంబును గలదిగనుండును. (౪)

శ్లో॥ సుతాశ్రిత స్స్వల్పసుతాం ప్రసూతే నారీం ప్రధానాం
వ్రతసంయుతాం చ। స్థూలాస్యదంతాం పితృ మాతృ
భక్తాం ప్రియంవదాం బ్రాహ్మణసమ్మతాం చ॥

తా॥ పంచమస్థానమునందు సూర్యుడుండిన - అల్పసంతానము, ప్రాధాన్యము, వ్రతానుష్ఠానము, స్థూలమైన ముఖదంతములు, తలిదండ్రులయందుభక్తి, ప్రియసంభాషణము, బ్రాహ్మణభక్తియుగలదియగు. (౫)

శ్లో॥ షష్ఠే దినేశః కురుతే ప్రగల్భాం హతారిపక్షాం వనితాసు దక్షామ్। ప్రశాంతచర్యాం ప్రియధర్మకృత్యాం
ధర్మానురక్తాం సుభగాం సురూపామ్॥ ౬॥

తా॥ షష్ఠస్థానమునందు సూర్యుడుండిన - ప్రాగల్భ్యము, శత్రుజయము, స్త్రీలలోనేర్పరితనము, సద్వ్యాపారములు, ధర్మాచరణము, ధర్మమునందాసక్తి, ఐశ్వర్యము, సౌందర్యంబును గలదిగనుండును. (౬)

శ్లో॥ సూర్యేఽస్తసంస్థే పతినావిముక్తాం నారీం తథా సర్వ
సుఖై ర్వియుక్తామ్। సదైవ రౌద్రాం ప్రణయేన హీనాం
కఫాశ్రయాం కిల్బిషిణీం కురూపామ్॥ ౭॥

తా॥ సప్తమస్థానమునందు సూర్యుడుండిన పతిచేవిడువబడుట, సుఖహీనత, ఎల్లప్పుడు భయంకరముగనుండుట, ప్రీతిలేకుండుట, కఫప్రధానరోగములు, పాపాచరణము, కురూపంబునుగలదియగు. (౭)

శ్లో॥ స్థానే ఽష్టమే వాసరపః ప్రసూతే దారిద్ర్యదుఃఖాన్విత
బంధుజాలాం। నారీం కుధర్మాన్వితధర్మకృత్యాం విషాద
యుక్తాం క్షతజార్దితాంగీం॥ ౮॥



తా॥ అష్టమస్థానమందు సూర్యుడుండిన - దారిద్ర్యదుఃఖమునను భవించునట్టి బంధుసమూహము, కుత్సితధర్మప్రచురమైన ధర్మాచరణము, దుఃఖము, కుసుమరోగయుక్తశరీరంబునుగలదియగును. (౮)

శ్లో॥ ధర్మస్థితో వాసరపః ప్రసూతే నారీం కుధర్మాం ప్రియ
సాహసాం చ। భాగ్యై ర్విహీనాం బహుశత్రుపక్షాం
ప్రభూతరోషాం విభవై ర్విహీనామ్॥ ౯॥

తా॥ నవమస్థానమునందు సూర్యుడుండిన - కుత్సితమైనధర్మము, సాహసకృత్యమునందిష్టము, దారిద్ర్యము, విస్తారమైనశత్రుపక్షము, అతిశయమైనరోషము, విభవములేకుండుటయు గలదియగును. (౯)

శ్లో॥ కర్మాశ్రితో వాసరపః ప్రసూతే కుకర్మరక్తాం వనితాం
సదైవ। ప్రభావిహీనాం శిథిలాం చ పత్యౌ స్వభావకృ
ష్ణాం పథికాం నితాంతమ్॥ ౧౦॥

తా॥ దశమస్థానమునందు సూర్యుడుండిన - కుత్సితధర్మాసక్తి, కాంతివిహీనత, పతియందుప్రీతిలేకుండుట, స్వభావముగనలుపువర్ణము, ఎల్లపుడుమార్గమునడుచుటయు గలదిగనుండును. (౧౦)

శ్లో॥ లాభాశ్రిత స్సంకురుతే దినేశో నారీం సలాభాం బహు
పుత్రపౌత్రామ్। జితేంద్రియాం సర్వకలాసు దక్షాం
క్షమాన్వితాం బాంధవపూజితాం చ॥ ౧౧॥

తా॥ ఏకాదశస్థానమునందు సూర్యుడుండిన - లాభము, పుత్రపౌత్రసంపత్తి, ఇంద్రియనిగ్రహము, సమస్తశిల్పములయందు సామర్థ్యము, ఓర్పు, బంధువులచే పూజ్యతయు గలదిగనుండును. (౧౧)

శ్లో॥ అసద్వ్యయాం ద్వాదశగో దినేశో నారీం ప్రసూతే
వినయేన హీనామ్। బహువ్యయాం పాపపరాం నృశంసాం
సర్వాశయాం శౌచవివర్జితాం చ॥ ౧౨॥

తా॥ ద్వాదశస్థానమునందు సూర్యుడుండిన, అసత్కార్యములయందు ధనవ్యయము, వినయవిహీనత, అధికవ్యయము, పాపకృత్యమునందాసక్తి, క్రూరకృత్యములు, సర్వపదార్థములయందాశ, శౌచాచారములు లేకుండుటయు గలదిగనుండును. (౧౨)

---

## చంద్రభావఫలము.

శ్లో॥ చంద్రో విలగ్నే యది శుక్లపక్షే నారీం ప్రసూతేఽతి
సురూపగాత్రామ్। కృష్ణే కృశాంగీం నితరాం సరోగాం
వివాదశీలాం సతతం కుశీలామ్॥ ౧॥

తా॥ లగ్నమునందు చంద్రుడుండగా శుక్లపక్షమునందు జన్మించిన స్త్రీ సౌందర్యముకలదిగనుండును. కృష్ణపక్షమునందు జన్మించిన స్త్రీ కృశించిన దేహము, రోగము, వివాదమాడుస్వభావము, కుత్సితమైనవ్యాపారములును గలదిగనుండును. (౧)

శ్లో॥ ధనాశ్రిత శ్శీతకరః ప్రసూతే ప్రభూతవిత్తాం ప్రణతాం
ప్రధానాం। ధర్మానుకూలాం పతిభక్తియుక్తాం నయాధి
కాం బ్రాహ్మణసమ్మతాం చ॥ ౨॥

తా॥ ద్వితీయస్థానమందు చంద్రుడుండినయెడల, విశేషమయినధనము, నమ్రత, స్త్రీలలోప్రాధాన్యము, ధర్మానుకూల్యము, పతిభక్తి, నీతి, బ్రాహ్మణులయందుప్రీతియు గలదిగనుండును. (౨)

శ్లో॥ చంద్రస్తృతీయే కఫవాతసారాం నారీం ప్రసూతేఽతి
కఠోరవాక్యామ్। కుసంసృతాం నీతివివర్జితాం చ
స్వభావదుష్టాం కృపణాం కృతఘ్నామ్॥ 3॥

తా॥ తృతీయస్థానమునందు చంద్రుడుండిన - కఫవాతరోగములును, పరుషసంభాషణము, కుత్సితమయిన ఆశ్రయము, నీతిలేకుండుట, దుష్టస్వభావము, కృపణత, చేసినమేలునుమరచుటయు గలదియగును.



శ్లో॥ చంద్రే సుఖస్థే బహుసౌఖ్యయుక్తాం నారీం ప్రసూ
తేఽద్భుతభూషణాం చ। స్థిరస్వభావాం శ్రుతిసర్వకృ
త్యాం భోగాధికాం దేవగురుప్రభక్తాం॥ ౪॥

తా॥ చతుర్థస్థానమునందు చంద్రుడుండిన సౌఖ్యము, చిత్రమయినభూషణములు, స్థిరస్వభావము, శాస్త్రసిద్ధమయినసర్వకృత్యములు, అధికభోగము, దేవగురువులయందుభక్తియుగలదిగనుండును. (౪)

శ్లో॥ సుతాశ్రిత శ్శీతకర స్సుపుత్రాం కరోతి నారీం గుణగౌ
రవాఢ్యామ్। ప్రభూతకృత్యాం సుఖసత్యయుక్తాంసుసం
యతాం భర్తృవశాం సురూపాం॥ ౫॥

తా॥ పంచమస్థానమందు చంద్రుడుండిన - సత్పుత్రులు, సద్గుణములు, అతిశయమైనపనులు, సౌఖ్యము, సత్యము, ఇంద్రియనిగ్రహము, భర్తకుఅనుకూల్యము, సౌందర్యంబునుగలదిగనుండును. (౫)

శ్లో॥ చంద్రోఽరిసంస్థః కురుతేఽల్పవిత్తాం ప్రభూతవైరాం విన
యేన హీనామ్। చలస్వభావాం క్షతసర్వగాత్రాం రోగా
భిభూతాం తనుతాసమేతాం॥ ౬॥

తా॥ షష్ఠస్థానమునందు చంద్రుడుండిన -అల్పవిత్తము, అధికవైర్యము, వినయహీనత, చంచలస్వభావము, గాయములు, నానారోగములు, దేహకృశత్వంబునుగలదియగును. (౬)

శ్లో॥ చంద్రోఽస్తసంస్థఃకురుతే విదగ్ధాం పతిప్రియాం ధర్మవివే
కయుక్తామ్। సుచారువాచాం విభవైస్సమేతాం తే
జోన్వితాం శౌచసమన్వితాం చ॥ ౭॥

తా॥ సప్తమస్థానమునందు చంద్రుడుండిన - చాతుర్యము, పతిభక్తి, ధర్మము, వివేకము, మనోహరమైనవాక్కు, సంపదలు, తేజస్సు, సదాచారంబును గలదిగనుండును. (౭)

శ్లో॥ చంద్రోఽష్టమస్థః కురుతే నృశంసాం నారీం కునేత్రాం
కుకుచాం కుభగాం చ। విహీనవేషాభరణాం సరోషాం
నితాంత మత్యద్భుతగర్హణాంచ॥ ౮॥

తా॥ అష్టమస్థానమునందు చంద్రుడుండిన ఘాతుకత్వము, కుత్సితమైన నేత్రములు స్తనములు భగము, అలంకారముఆభరణములును లేకుండుట, రోషము, ఆశ్చర్యకరనిందయుగలదిగనుండును.

శ్లో॥ ధర్మాశ్రిత శ్శీతకరః ప్రసూతే ప్రభూతధర్మాం వని
తాం సుమధ్యాం। భోగాధికాం కల్పమతాం మనో
జ్ఞాం సుభృత్యపుత్రాం చ సుభూరిసౌఖ్యాం॥ ౯

తా॥ నవమస్థానమునందు చంద్రుడుండినధర్మాధిక్యము, సొగసైన నడుము, అధికభోగము, దాతృత్వము,మనోహరత్వము, మంచిభృత్యులు, పుత్రసంపత్తి, సౌఖ్యంబునుగలదిగనుండును. (౯

శ్లో॥ కర్మాశ్రిత శ్శీతకరః ప్రసూతే ప్రభూతహేమద్రవిణాం
ప్రసిద్ధాం। నారీం నిరీహాం కులసర్వముఖ్యాం త్యాగా
న్వితాం పుణ్యపరాం సుసత్యామ్॥ ౧౦॥

తా॥ దశమస్థానమునందు చంద్రుడుండిన విస్తారమయిన స్వర్ణాభరణములు, లోకమునందుప్రసిద్ధి, విషయాసక్తిలేకుండుట, కులమునందుముఖ్యత్వము, త్యాగము, పుణ్యమునందాసక్తి, సత్యంబునుగలదిగనుండును.

శ్లో॥ లాభాశ్రిత శ్శీతకర స్సులాభాం భవ్యాం విధిజ్ఞాం కురుతే
సుదాంతామ్। నారీం ప్రసన్నాం ప్రణయేనయుక్తాం
దానాన్వితాం వ్యాధివివర్జితాం చ॥ ౧౧॥

తా॥ ఏకాదశస్థానమందు చంద్రుండుండిన - విశేషలాభము, మనోహరత్వము, విహితార్థజ్ఞానము, ఇంద్రియనిగ్రహము, ప్రసన్నత్వము, ప్రీతి,దానము, ఆరోగ్యంబునుకలదిగనుండును. (౧౧)



శ్లో॥ కరోతి చంద్రో వ్యయగో వ్యయాఢ్యాం వాతప్రభా
వాం వనితాం సుతీవ్రామ్। దీనాననాం నీతివివర్జితాం చ
క్షమావిహీనాం నిధనాం నితాంతం॥ ౧౨॥

తా॥ ద్వాదశస్థానమునందు చంద్రుడుండిన - అతిశయమైనవ్యయము, వాతరోగము, కార్యములయందు వేగము, దీనమైన వదనము, నీతి ఓర్పులులేకుండుట, దారిద్ర్యంబునుగలదిగనుండును. (౧౨)

అంగారకభావఫలము.

శ్లో॥ లగ్నాశ్రితో భూతనయః ప్రసూతే నారీం మహారకసు
దుఃఖితాంగామ్। గతప్రభావాం పతినా తిరస్కృతాం
సుదుర్భగాం సర్వసమన్వితాం చ॥ ౧॥

తా॥ లగ్నమునందు అంగారకుడుండగాజన్మించినస్త్రీ - మిక్కిలి యెఱుపువర్ణముకలిగి క్లేశయుక్తమగుశరీరము, అగౌరవము,పతిచేతిరస్కారము, దారిద్ర్యముమొదలగునవికలిగియుండును. (౧)

శ్లో॥ ధనాశ్రితో భూతనయో విశీలాం ధనేనహీనాం కురుతే
కుకాంతాం। వయోధికాం కామపరాం సరోషాం రోగా
ధికాం కేశవివర్జితాం చ॥ ౨॥

తా॥ ద్వితీయస్థానమునందు అంగారకుండుండిన - ఆచారములేకుండుట దారిద్ర్యము, కుత్సితుడైనభర్త, అధికవయస్సు, కామాధిక్యము, రోషము, నానారోగములు, వెండ్రుకలులేకుండుటయుగలదియగును.

శ్లో॥ తృతీయసంస్థః కురుతే మహీజో నారీం నితాంతం సుభ
గాం సుశాంతామ్। బంధుప్రియాం సాధురతాం ప్రశస్తాం
విహీనరోగాం ప్రథితప్రభావాం॥ 3॥

తా॥ తృతీయస్థానమునందు అంగారకుఁడుండినసౌభాగ్యము, ఓర్పు, బంధుప్రీతి, సాధుజనులయందుప్రేమ, ప్రాశస్త్యము, ఆరోగ్యము, గొప్పతనంబునుగలదిగనుండును. ౩॥

శ్లో॥ చతుర్థగో భూతనయః ప్రసూతే నారీం హతాశాం హత
ధర్మకృత్యామ్। సౌఖ్యేనహీనాం విధవాం విశాలాం జనై
ర్నిరస్తాం సతతం సరోషామ్॥ ౪॥

తా॥ చతుర్థస్థానమునందు అంగారకుఁడుండిన ఆశాభంగము, ధర్మమునందశ్రద్ధ, అసౌఖ్యము, వైధవ్యము, స్వగృహములేకుండుట, బంధువులచేత్రోయబడుట, మిక్కిలిరోషంబునుగలదియగును. (౪)

శ్లో॥ సుతాశ్రితో భూతనయః ప్రసూతే నారీం కుపుత్రాం
త్రపయా విహీనాం। కుసంమతాం పాపవిధానరక్తాం
సుతేన హీనాం హతబంధువర్గామ్॥ ౫॥

తా॥ పంచమస్థానమున అంగారకుఁడుండిన - కుత్సితపుత్రులు, లజ్జలేకుండుట, దుష్టులగువారితోచెలిమి, పాపకృత్యములయందిష్టము, పుత్రులులేకుండుట, బంధువర్గములేకుండుటయుగలదియగును. ౫॥

శ్లో॥ రిపుస్థితో భూతనయః ప్రసూతే నారీం సనాథాం హత
శత్రుపక్షామ్। ప్రభూతకోశాం సుజనానురక్తాం విద్యా
ధికాం రోగవిసర్జితాం చ ॥ ౬॥

తా॥ షష్ఠస్థానమునందు అంగారకుఁడుండిన పతితోఁగూడికొనియుండుట, శత్రువులులేకుండుట, అధికధనము, సుజనులయందనురాగము, విద్యాధిక్యము, ఆరోగ్యంబును కలదిగనుండును. (౬)

శ్లో॥ అస్తస్థితో వై ధరణీసుతస్తు బాల్యే ప్రసూతే విధ
వాం చ నారీమ్। దుష్టస్వభావాం విభవేన హీనాం సు
కుత్సితాంగీం గుణవర్జితాం చ ॥ ౭॥



తా॥ సప్తస్థానమునందు అంగారకుడుండిన బాల్యమునందేవైధవ్యము, దుష్టస్వభావము, సంపదలేకుండుట, కుత్సితమయినదేహము, దుర్గుణములును కలిగియుండును. (౭)

శ్లో॥ మృత్యుస్థితో భూతనయః ప్రసూతే ప్రభూతరోగాం
సుకృశాం వినాథాం। దారిద్ర్యదుఃఖక్షతశోకభాజాం
హింసాధికాం కాంతివివర్జితాం చ ॥ ౮॥

తా॥ అష్టమస్థానమునందు అంగారకుఁడుండిన- నానారోగములు, దేహకృశత్వము, నాథుడులేకుండుట, దారిద్ర్యదుఃఖము, శరీరమునందు గాయమువలనిదుఃఖముహింసయందాసక్తి, కాంతిలేకుండుటయుగలదియగు

శ్లో॥ ధర్మాశ్రితో భూతనయో విధర్మాం కరోతి నారీ మ
సుఖాం సురోగాం। భాగ్యై ర్విహీనాం సుజనై ర్నిరస్తాం
ప్రియామిషాం పానపరాం సదైవ॥ ౯

తా॥ నవమస్థానమందు అంగారకుఁడుండిన-ధర్మవిహీనత, అసౌఖ్యము, రోగము, దారిద్ర్యము, సుజనులకు ప్రీతిలేకుండుట, మాంసమునందిష్టము, ఎల్లపుడు మద్యపానమునందాసక్తియు గలదియగును.

శ్లో॥ కర్మాశ్రితో భూతనయః ప్రసూతే నారీం కుకర్మాం ప్ర
వణాం కుభావామ్। శీలేన హీనాం నిరతాం విధర్మే
లజ్జావిహీనాం మతివర్జితాం చ ॥ ౧౦

తా॥ దశమస్థానమునందు అంగారకుఁడుండినకుత్సితమయినపనులు, వినయము, కుత్సితస్వభావము, ఆచారహీనత, విరుద్ధధర్మములయందాసక్తి, లజ్జలేకుండుట, బుద్ధిహీనత్వంబునుకలదిగనుండును. ౧౦॥

శ్లో॥ లాభాశ్రియస్థః కురుతే మహీజః ప్రభూతలాభాం వని
తాం నిరీహాం। శుభస్వభావాం వివిధోపచారాం పత్యౌ
రతాం ప్రీతిపరాం సుధర్మే॥ ౧౧॥

తా॥ ఏకాదశస్థానమునందు అంగారకుఁడుండిన- మిక్కిలిలాభము, వస్తువులయందత్యాశ లేకుండుట, మంచిస్వభావము, నానావిధోపచారములు, పతియందుప్రీతి, ధర్మమునందాసక్తియుగలదిగనుండును. ౧౧॥

శ్లో॥ వ్యయస్థితో భూతనయః ప్రసూతే నారీం తదన్నాం గుణ
వర్జితాం చ। అపద్వ్యయాం పానపరాం నృశంసాం స
దాతురాం ప్రాణవివర్జితాం చ॥ ౧౨॥

తా॥ ద్వాదశస్థానమునందు అంగారకుఁడుండిన- ఎల్లుబియ్యపుఅన్నమునందాసక్తి, దుర్గుణములు, అసత్కార్యములయందు ధనవ్యయము, మద్యపానమునందాసక్తి, క్రౌర్యము, ఎల్లపుడు ఎద్దియోయొకరోగము, బలహీనతయుగలదిగనుండును.

---

## బుధభావఫలము.

శ్లో॥ కరోతి సౌమ్య స్తనుగ స్సురూపాం పతిప్రధానాం న
యధర్మయుక్తామ్। విశాలనేత్రాం ప్రచురాన్నపానాం
ప్రియాం సదా సత్యసమన్వితాం చ॥ ౧॥

తా॥ లగ్నమునందు బుధుఁడుండగా జన్మించినస్త్రీ సౌందర్యము, పతిభక్తి, నీతి, ధర్మము, విశాలనేత్రములు, కొరవడనిఅన్నపానములు, ఎల్లపుడుప్రీతి, సత్యంబును గలదిగనుండును. ౧॥

శ్లో॥ ధనస్థిత స్సోమసుతః ప్రసూతే ధనాన్వితాం శుద్ధియుతాం
సురూపాం।నారీం ద్విజారాధనతత్పరాంచ క్రతుప్రియాం
శ్రీసహితాం పురాణ్యాం॥ ౨॥

తా॥ ద్వితీయస్థానమునందు బుధు డుండిన - ధనసంపత్తి, పారిశుద్ధ్యము, సౌందర్యము, దేవబ్రాహ్మణపూజయందాసక్తి, యాగములయందిష్టము, సంపత్తు, పురాణశ్రవణమునందాసక్తియుగలదిగనుండును.



శ్లో॥ తృతీయగ స్సోమసుతో ధనాఢ్యాం దేవద్విజారాధన
తత్పరాం చ। నారీం ప్రసూతే సుతమానభాజాం జనా
నుకూలాం ప్రభుతాసమేతామ్॥ 3

తా॥ తృతీయస్థానమునందు బుధుఁడుండిన- ధనసంపత్తి, దేవబ్రాహ్మణపూజయందాసక్తి, పుత్రులు, మానము,జనానుకూల్యము, ప్రభుత్వంబును గలదిగనుండును. 3॥

శ్లో॥ సౌమ్య స్సుఖస్థ స్సుసుఖాం ప్రసూతే యుతాం ప్రభూ
తై స్సుజనై స్సుభృత్యైః। దేవద్విజారాధనతత్పరాంచ
ప్రఖ్యాతవంశాం ప్రియధర్మవర్గాం॥ ౪॥

తా॥ చతుర్థస్థానమునందుబుధుఁడుండిన సుఖము, అనేకులగుసాధువులైనస్నేహితులు,భృత్యులు, దేవబ్రాహ్మణభక్తి, గొప్పవంశము, ధర్మమునందాసక్తియు గలిగియుండును. ౪॥

శ్లో॥ సుతస్థిత స్సోమసుతోఽల్పపుత్రాం స్వల్పాన్నవిత్తాం కల
హప్రియాం చ। వృథాటనాం గర్హితసర్వకృత్యాం
లక్ష్మ్యావిహీనాం హతసాధుపక్షాం॥ ౫॥

తా॥ పంచమస్థానమందు బుధుఁడుండిన అల్పసంతానము, స్వల్పాన్నము. స్వల్పధనము, కలహమునందుప్రీతి, వ్యర్థమయిన సంచారము, నిందితములైన సర్వకృత్యములు, దారిద్ర్యము, సాధువులయందు ద్వేషంబునుగలిగియుండును. ౫॥

శ్లో॥ సౌమ్యోఽరిసంస్థో హతశత్రుపక్షాం నారీం ప్రసూతే
సుదయాసమేతాం। గతాయుషాం తీవ్రకరాం సుకామాం
పరోపకారవ్యసనాభిభూతామ్॥ ౬॥

తా॥ షష్ఠస్థానమునందు బుధుఁడుండిన- శత్రుపక్షమునందుద్వేషము, కరుణ, దీర్ఘాయుష్యము, కార్యములయందు వేగము, కామాధిక్యము, పరోపకారమునందు వ్యసనంబునుగలిగియుండును. ౬॥

శ్లో॥ సౌమ్యః కళత్రే ప్రవరాం విదగ్ధాం శాస్త్రానురక్తాం శుభ
కర్తృకాం చ। కరోతి నారీం నియమై రుపేతాం శుభప్ర
భావాం ప్రణయాన్వితాం చ॥ ౭॥

తా॥ లగ్నమునకు సప్తమస్థానమందు బుధుడుండిన శ్రైష్ఠ్యము, కార్యములయందుచాతుర్యము, శాస్త్రములయందు ప్రీతి, శుభకృత్యములు, వ్రతాదినియమములయందాసక్తి, మంచిమహిమ, జనులయందు ప్రీతియు గలదియగు.

శ్లో॥ మృత్యుస్థిత స్సోమసుతః కృతఘ్నాం నారీం ప్రసూతే
విగతాభిమానాం। నిరస్తధర్మాం జనసంవిరుద్ధాం సదా
తురాం భీతిసమన్వితాం చ॥ ౮

తా॥ అష్టమస్థానమునబుధుఁడుండిన, చేసినయుపకారమునుమఱచుస్వభావము, అభిమానము లేకుండుట, ధర్మము లేకుండుట, జనులతో విరోధము, ఎల్లపుడురోగము, భయస్వభావంబునుగలదియగు. ౮॥

శ్లో॥ ధర్మాశ్రిత స్సోమసుత స్సధర్మాం ధన్యాం ప్రసూతే
వనితాం వినీతాం। భాగ్యాధికాం కీర్తిపరాం సుదక్షాం
క్షమాధికాం సత్యసమన్వితాం చ॥ ౯॥

తా॥ నవమస్థానమందు బుధుఁడుండిన ధర్మమునందాసక్తి, పుణ్యము, వినయము, ధనసంపత్తు, యశస్సు, సామర్థ్యము, అధికమైనఓర్పు, సత్యంబునుగలిగియుండును. ౯॥

శ్లో॥ కర్మాశ్రిత స్సోమసుత స్సుకర్మాం పతిప్రధానాం వనితాం
ప్రసూతే। ప్రభూతకోశాం చ సువర్ణభాజాం నయప్రధా
నాం వినయై స్సమేతాం॥ ౧౦

తా॥ దశమస్థానమునందుబుధుడుండినసత్కర్మాచరణము, పతిభక్తి, విశేషధనసంపద, సౌందర్యము, నీతి, వినయంబునుగలదియగు.

శ్లో॥ లాభాశ్రిత స్సోమసుతః ప్రసూతే స్త్రీం ప్రభూతప్రియ
పుష్టచిత్తాం। సులాభయుక్తాం శుభశీలభాజాం పతివ్ర
తాం వా జనసమ్మతాం చ॥ ౧౧

తా॥ ఏకాదశస్థానమందు బుధుఁడుండిన - సంతుష్టచిత్తము, విశేషలాభము, మంచిస్వభావము, పాతివ్రత్యము, జనసమ్మతియుగలదియగు.

శ్లో॥ వ్యయస్థిత స్సోమసుతః ప్రసూతే నారీం విలజ్జాం విగత
ప్రతాపాం। వివాదశీలాం వికలాం కృశాంగీం గుణై
ర్వియుక్తాం సుజనై ర్నిరస్తాం॥ ౧౨॥

తా॥ ద్వాదశమందుబుధుఁడుండిన - ఆశ్చర్యముచే ప్రకృతార్థజ్ఞానవిహీనత, ప్రతాపహీనత, కలహించుస్వభావము, వైకల్యము, కృశించినదేహము, గుణహీనత, సజ్జనులచేత నిందింపబడుటయుగలిగియుండును.



## గురుభావఫలము.

శ్లో॥ లగ్నాశ్రితో దేవగురుః ప్రసూతే సుసత్యయుక్తాం సుమ
నోజ్ఞభోగామ్। గంభీరవాక్యాం ప్రియసాధుపక్షాం సురూ
పగాత్రాం ప్రమదోత్తమాం చ॥

తా॥ లగ్నమునందు గురువుండగా జన్మించిన స్త్రీ సత్యము, మంచి భోగములు, గంభీరవాక్కు, సజ్జనసహవాసము, సౌందర్యము, స్త్రీలలో శ్రైష్ఠ్యంబునుగలిగియుండును. ౧॥

శ్లో॥ ధనస్థితో దేవగురుః ప్రసూతే ప్రభూతవిత్తాం సుభగాం
మనోజ్ఞామ్। సుధర్మిణీం నీతిపరాం ప్రధానాం గతస్పృ
హాం హానివివర్జితాం చ॥ ౨॥

తా॥ ద్వితీయమునగురువుండిన,విశేషధనము, సౌభాగ్యము,మనోహరత్వము, సత్కార్యములయందాసక్తి,నీతి, స్త్రీలలోప్రాధాన్యము,నిస్పృహచిత్తము, హానిలేకుండుటయుఁగలదిగనుండును.

శ్లో॥ తృతీయసంస్థః కురుతే సురేజ్యో నారీం నితాంతం విహతప్రభావామ్ । సుదోషయుక్తాం గురుతావిహీనాం వివర్జితాంగాం విపదా సదైవ ॥ ౩॥

తా॥ తృతీయస్థానమునగురువుండిన గొప్పతనములేకుండుట, పలుదోసములు, అగౌరవము, ఎల్లప్పుడురోగములచేతనైన అంగశైథిల్యంబును కలదిగనుండును, ౩॥

శ్లో॥ చతుర్థసంస్థః కురుతే సురేజ్యో నారీం సుఖాఢ్యాం వివిధాన్నపానామ్ । ప్రభూతభృత్యాభరణాం ప్రసిద్ధాం సుపూజితాంగాం గుణగౌరవాం చ ॥ ౪॥

తా॥ చతుర్థస్థానమునందు గురువుండిన అతిశయసౌఖ్యము, నానావిధమయిన అన్నపానములు, అధికభృత్యులు, ఆభరణములు, లోకప్రసిద్ధి, సౌందర్యము, సద్గుణములునుగలదిగనుండును. ౪॥

శ్లో॥ సుతస్థితో దేవగురుస్సుపుత్రాం నారీం ప్రసూతే హతపాపకృత్యామ్। సదానుకూలాం వ్రతధర్మదక్షాం సత్యాత్మకాం రమ్యసభాసు భావ్యామ్॥ ౫॥

తా॥ పంచమస్థానమునందుగురువుండిన సత్పుత్రులు, పాపకృత్యములులేకుండుట, అనుకూలస్వభావము, వ్రతధర్మములయందాసక్తి, సత్యము, సభాపూజ్యతయుఁగలదిగనుండును. ౫॥

శ్లో॥ జీవోఽరిసంస్థో బహుశత్రుపక్షాం నారీం స ధత్తే నయసంయుతాం చ । బహ్వాపదాం త్రాససమన్వితాంగీం ప్రధానకృత్యాం కృతకోపచారామ్॥ ౬॥



తా॥ షష్ఠస్థానమునందు గురువుండిన- శత్రుపక్షము, నీతి, అనేకసంకటములును, భయస్వభావము, ముఖ్యకార్యములు, కృత్రిమమైన ఉపచారములును కలదిగనుండును. ౬॥

శ్లో॥ కళత్రగో దేవగురుః ప్రసూతే సుభావయుక్తాం ప్రమదాం సుపుణ్యామ్ । జ్ఞానానురక్తాం బహుశత్రుపక్షాం పతిప్రియాం కీర్తిసమన్వితాం చ ॥ ౭॥

తా॥ సప్తమస్థానమందుగురువుండిన మంచిస్వభావము, పుణ్యము, మంచిజ్ఞానము, మిక్కిలిశత్రుపక్షము, పతియందుప్రేమ, మంచికీర్తియుఁగలదిగనుండును. ౭

శ్లో॥ జీవోఽష్టమస్థఃకురుతేఽల్పసత్త్వాంనారీంవిశాలాం పతినా వియుక్తాం । శూలాంఘ్రిహస్తాం వ్యసనప్రధానాం హీనాశనాం రోగసమన్వితాం చ॥ ౮॥

తా॥ అష్టమస్థానమందుగురువుండిన, స్వల్పమైననిజము, గృహహీనత, పతివియోగము, హస్తపాదములయందు శూలరోగము, అధికదుఃఖము, కొరవడినభోజనము, రోగయుక్తశరీరంబును గలదిగనుండును.

శ్లో॥ భాగ్యస్థ జీవోఽమరసత్యరక్తాం తటాకకృత్యోచ్ఛ్రయకృత్యతుష్టాం। రమ్యాం ప్రశస్తాం ద్విజభక్తియుక్తాం మహాధనాం చారుజనాం కృతజ్ఞాం॥ ౯॥

తా॥ నవమస్థానమందుగురువుండిన దేవతాభక్తి, సత్యము, తటాకనిర్మాణము మొదలగు సత్కృత్యములచే సంతోషము, మనోహరత్వము, ప్రసిద్ధి, బ్రాహ్మణభక్తి, విశేషధనము, మంచిపరిజనము, ఉపకారస్మృతియుఁ గలదిగనుండును. ౯

శ్లో॥ కర్మాశ్రితో దేవగురుః ప్రసూతే ప్రఖ్యాతకర్మాం ప్రగు
ణాం గుణజ్ఞామ్। ప్రభూతదాసీం వినయప్రగల్భాం
నారీం సుపుణ్యాద్భుతచేష్టితాం చ॥ ౧౦॥

తా॥ దశమస్థానమునందు గురువుండిన ప్రఖ్యాతమయినపనులు, సద్గుణములు, గుణజ్ఞత, విశేషమయినదాసీవర్గము, వినయము, కాంతి, పుణ్యకరములై ఆశ్చర్యకరమైనకృత్యములును కలదిగనుండును. ౧౦॥

శ్లో॥ లాభాశ్రితో దేవగురుః ప్రసూతే నారీం సుదాంతాం
బహుకీర్తియుక్తాం శ్రియాన్వితాం శిల్పపరాం సుసత్యాం
సదానురక్తాం గుణకీర్తనేన॥ ౧౧॥

తా॥ ఏకాదశస్థానమునందు గురువుండిన ఇంద్రియనిగ్రహము, మంచికీర్తి, సంపద, శిల్పవిద్యలయందాసక్తి, సత్యంబునుంగలిగి గుణముల పొగడుటచేత అనుకూలురాలుగనుండును. ౧౧॥

శ్లో॥ వ్యయస్థితో దేవగురుః ప్రసూతేఽసాధువ్యయాంరోగస
మన్వితాంగీం। లాభాభిభూతాం కులధర్మహీనాం నిస
ర్గదుష్టాం పరధర్మపక్షాం॥ ౧౨॥

తా॥ ద్వాదశస్థానమునందు గురువుండిన దుష్కార్యములయందు ధనవ్యయము, రోగయుక్తశరీరము, లాభములేకుండుట, స్వకులధర్మవిహీనత, దుష్టస్వభావము, అన్యమతధర్మమునందాసక్తియు గలదిగనుండును,

---

## శుక్రభావఫలము.

శ్లో॥ లగ్నాశ్రితో దైత్యగురుః ప్రసూతే నారీం సుకాంతాం
సుభగాం విదగ్ధాం। విత్తాధికాం దోషవివర్జితాంగీం
హతారిపక్షాం సతతం సుశీలాం॥ ౧॥



తా॥ లగ్నమునందు శుక్రుఁడుండిన ప్రియమైనభర్త, సౌభాగ్యము పనులయందు నేర్పు, విశేషధనము, దోషములేనిశరీరము, శత్రుపక్షనాశము, మంచిస్వభావంబునుకలదిగనుండును. ౧॥

శ్లో॥ శుక్రో ధనస్థః స్వధనాం ప్రసూతే విదగ్ధచేష్టాం ప్రమ
దాందురాపామ్। ధర్మధ్వజాం ధర్మపరాం సుధన్యాం
విఖ్యాతకర్మాం మృదుభాషిణీం చ॥ ౨॥

తా॥ ద్వితీయమునందు శుక్రుడుండిన - విశేషధనము, చతురమయినపనులు, అస్వాధీనత,డంభార్థమైనవేషములు, ధర్మమునందాసక్తి, యోగ్యత, ప్రసిద్ధవ్యాపారములు, మృదుభాషణంబునుకలదిగనుండును.

శ్లో॥ తృతీయగో దైత్యగురుః ప్రసూతే నారీం దరిద్రాంద్రుత
బంధువర్గాం। విహీనశోకాం పతినా విముక్తాం సునిష్ఠు
రాం గద్గదభాషిణీం చ॥ ౩॥

తా॥ తృతీయస్థానమందుశుక్రుడుండిన, దారిద్ర్యము, ఓడిపోయిన బంధువర్గము, అతిశయమైనశోకము, పతివియోగము, పారుష్యము, డగ్గుత్తికతో భాషణంబునుకలదిగనుండును. ౩॥

శ్లో॥ సుఖాశ్రితో దైత్యగురుః ప్రసూతే ప్రభూతసౌఖ్యాం
వనితాం ధనాఢ్యామ్। విలాసశీలాం ప్రియధర్మకృత్యాం
జితేంద్రియాం వంశవిభూషణాం చ॥ ౪॥

తా॥ చతుర్థమందు శుక్రుడుండిన, విశేషసౌఖ్యము, విశేషధనము, విలాసస్వభావము, ధర్మకృత్యములయందుప్రీతి, ఇంద్రియనిగ్రహంబునుకలదిగనుండుటయేగాక తనవంశమునుప్రకాశింపజేయునదియగును.

శ్లో॥ కరోతి శుక్రః ఖలు పంచమస్థో నారీం సమృద్ధాంబహు
కన్యకాఢ్యాం। రమ్యానుకా[illegible]
ప్రధానాం నిజవంశమధ్యే॥



తా॥ పంచమమందు శుక్రుడుండిన ధనధాన్యాదిసంపద, విశేషముగ స్త్రీసంతతి, చతురమయినవేషము, సత్సహవాసము, తనవంశమునందు ప్రాధాన్యంబునుకలదిగనుండును. ౫॥

శ్లో॥ శుక్రోఽరిసంస్థః ప్రకరోతి నారీ మీర్ష్యాప్రధానాం బ
హుకోపయుక్తాం। తీవ్రస్వభావాం విజితారిపక్షాం సదా
నిరస్తాం పతిపుత్రవర్గైః॥

తా॥ షష్ఠస్థానమందు శుక్రుడుండిన, ఓర్వలేనితనము, అధికకోపము, తీక్ష్ణమయినస్వభావము, శత్రుపక్షజయంబును కలిగి పతిపుత్రవర్గములచేత త్యజింపబడునదియగును, ౬॥

శ్లో॥ కళత్రగో దైత్యగురుః ప్రసూతే నారీం ప్రభూతద్రవిణ
ప్రభావాం। పతిప్రియాం శాస్త్రరతాం ప్రగల్భాం హి
తాం ద్విజానాం జనవల్లభాం చ॥ ౭॥

తా॥ సప్తమస్థానమందు శుక్రుడుండిన - ధనాధిక్యముచే ప్రసిద్ధి, పతియందు ప్రేమ, శాస్త్రాభ్యాసమునందాసక్తి, ప్రౌఢిమ, బ్రాహ్మణులయందు విశ్వాసంబునుగలదై జనులకుహితముసేయునదియగును.

శ్లో॥ శుక్రోఽష్టమస్థః కురుతే ప్రమత్తాం విషాదభాజాం విభవై
ర్వియుక్తాం। దయావిహీనాం పరవంచనార్తాం కుచేలినీం
ధర్మవివర్జితాం చ॥ ౮॥

తా॥ అష్టమమందు శుక్రుడుండిన - మదము, దుఃఖము, విభవహీనత్వము, నిర్దయ, పరులనువంచించుటయందాసక్తి, కుత్సితమైనవస్త్రములు, ధర్మహీనత్వంబునుకలదిగనగును. ౮॥

శ్లో॥ ధర్మాశ్రితో ధర్మపరాం ప్రసూతే శుక్ర స్సుముఖ్యాం
వనితాం చ లోకే। నానార్థవస్త్రాశ్రయభోజనాఢ్యాం
సుపుష్టచిత్తాం పురుషానుకారాం॥ ౯



తా॥ నవమస్థానమందు శుక్రుడుండిన ధర్మమునందాసక్తి, స్త్రీలలో ప్రాధాన్యము, పలుదెఱంగుల ధన వస్త్రములు. పదార్థములు - షడ్రసోపేతాన్నము, సంతుష్టచిత్తము, పురుషానుసరణంబునుకలదియగును.

శ్లో॥ కర్మాశ్రితో దైత్యగురుః ప్రసూతే నారీం యశస్యాం
సుధనైస్సమేతాం। ప్రసిద్ధకర్మప్రతిపూజితాంగీం ప్రజా
ధికాం కల్యతరాం సుసత్యాం॥ ౧౦॥

తా॥ దశమమునందు శుక్రుడుండిన - యశస్సు, విశేషధనము, సత్కార్యాచరణమువలన పూజింపబడుశరీరము. అధికసామర్థ్యము, సౌందర్యము, సత్యంబునుకలదిగనుండును. ౧౦॥

శ్లో॥ లాభాశ్రితో దైత్యగురుః ప్రసూతే ప్రభూతలాభాం
వనితాం సదైవ। విముక్తదోషాం బహుశాస్త్రరక్తాం
మహాప్రభావాం వివిధాశ్రియాం చ॥ ౧౧॥

తా॥ ఏకాదశమందు శుక్రుడుండిన విశేషలాభము, దోషవిహీనత్వము, విశేషముగశాస్త్రాభ్యాసమునందాసక్తి, అధికప్రభావము, నానావిధగృహాద్యాశ్రయములును కలదిగనుండును. ౧౧॥

శ్లో॥ వ్యయస్థితోఽసద్వ్యయదుఃఖభాజాం నారీం ప్రసూతే
భృగుజ స్స్వమాంగాం। మాయాధికాంకృత్రిమవాక్య
రక్తాం రోగాభిభూతాం మతివర్జితాం చ॥ ౧౨

తా॥ ద్వాదశమందు శుక్రుడుండినఅసద్వ్యయము, దుఃఖము, ఋజువైన అవయవములు, మాయాధిక్యము, కృత్రిమసంభాషణము, రోగము, బుద్ధిహీనతయు గలదిగనుండును. ౧౨॥

---

## శనిభావఫలము.

శ్లో॥ కరోతి సౌరిః ఖలు లగ్నసంస్థో విరూపదేహాం వనితాం
నితాంతం। శ్రమాధికాం కీర్తివివర్జితాంగీం స్థూలాస్థిదం
తాం నయనై ర్విహీనాం॥ ౧॥

తా॥ జన్మలగ్నమునందు శనియుండిన - వికారదేహము, శ్రమా
ధిక్యము, కీర్తిలేకుండుట, లావుగనుండు నెముకలు దంతములు, నేత్రవికారం
బును గలదిగనుండును.

శ్లో॥ ధనస్థిత స్సూర్యసుతః ప్రసూతే ధనేనహీనాం వనితాం
నిరస్తాం। సదాభిభూతాం ప్రణయేన హీనాం నృశంస
భావాం నయసంకులాం చ॥ ౨

తా॥ ద్వితీయమందు శనియుండిన - దారిద్ర్యము, స్త్రీలలో అప్రా
ధాన్యము, పరులచేతిరస్కరింపఁబడుట - అప్రీతి - క్రూరస్వభావము, నీతి
లేకుండుటయుఁగలదిగనుండును. ౨॥

శ్లో॥ తృతీయసంస్థో రవిజః ప్రసూతే దక్షాం ప్రధానాం వని
తాం సుధన్యాం। బహుప్రజాం త్రాణవిధానశక్తాం
ప్రశంసితాం సాధుజనేన నిత్యం॥ ౩॥

తా॥ తృతీయమందు శనియుండిన- సామర్థ్యము, స్త్రీలలో ప్రాధా
న్యము, కృతార్థత, విశేషసంతానము, పరులను తానురక్షించుటయందాస
క్తి, సాధుజనులతో చెలిమియుఁగలదిగనుండును. ౩॥

శ్లో॥ కరోతి మంద స్సుఖగః కుసౌఖ్యాం మతిప్రహీనాం వని
తాం కృతఘ్నాం। చలస్వభావాం విభవై ర్విహీనాం
సదాహితాం నీచసమాగమేన॥ ౪॥



తా॥ చతుర్థమందు శనియుండిన అసౌఖ్యము, బుద్ధిలేకుండుట, చేసి
న మేలుమరచుట, చంచలస్వభావము, విభవహీనత్వము, ఎల్లపుడు దుష్టస
హవాసముచేత నహితకార్యము లొనర్చుటయు గలదియగును. ౪॥

శ్లో॥ సుతాశ్రితో భాస్కరజో విపుత్రాం నారీం ప్రసూతే
ఘృణయా విహీనాం। ప్రభూతదర్పాం గణికానుకారాం
వివర్జితాం సాధుసమాగమేన॥ ౫॥

తా॥ పంచమమందు శనియుండిన- పుత్రులులేకుండుట, నిర్దయ,
అధికగర్వము, వేశ్యాంగనావ్యాపారములు, దుర్మార్గులతో చెలిమియు కల
దిగనుండును. ౫॥

శ్లో॥ మందోఽరిసంస్థః కురుతేఽతిసుందాం నారీం ప్రధానాం
తనయై స్సమేతామ్। ప్రభూతవస్త్రాభరణై స్సమేతాం
గుణానురక్తాం సుతవల్లభాం చ॥ ౬॥

తా॥ షష్ఠస్థానమందు శనియుండిన మాంద్యము, స్త్రీలలో ప్రాధా
న్యము, విశేషపుత్రసంతతి, విస్తారములైన వస్త్రాభరణములు, సద్గుణము
లు, పుత్రులయందు ప్రీతియుఁగలదిగనుండును. ౬॥

శ్లో॥ సౌరోఽస్తసంస్థో విధవాం ప్రసూతే వివర్జితాం వా
వనితాం సదైవ। రోగాధికాం పానపరాం కుమిత్రాం
ప్రభూతదోషాం బహుకూటభాజామ్॥ ౭॥

తా॥ సప్తమమందు శనియుండిన - వైధవ్యము, స్త్రీలలో అప్రాధా
న్యము, బహురోగములు, మద్యపానాసక్తి, దుష్టజనస్నేహము, పలుదో
షములు, బహుజనసమూహంబునుగలదిగనుండును.

శ్లో॥ స్థానేష్టమే సూర్యసుతః ప్రసూతే నారీం ప్రదగ్ధాం నిజ
కర్మదోషైః। దుష్టస్వభావాం గతధర్మసత్యాం మలిమ్లు
చాం వంచనతత్పరాం చ॥ ౮

తా॥ అష్టమమందు శనియుండిన స్వయముగ పాపకృత్యములఁ జేయుట, దుష్టస్వభావము, ధర్మము సత్యము ఇవి లేకుండుట, దొంగతనము, వంచనాసక్తియు కలదిగనుండును.

శ్లో॥ ధర్మాశ్రిత స్సూర్యసుతః ప్రసూతే కుకర్మరక్తాం వనితాం సదైన్య । వ్యయాధికాం లుబ్ధసుహృత్సమేతాం విద్యావిహీనాం ననతాం కదాచిత్ ॥

తా॥ నవమమందు శనియుండిన- కుత్సితచేష్టలు, అధికవ్యయము, లుబ్ధులతో స్నేహము, విద్యలేకుండుట, అనమ్రతయు కలదిగనుండును.

శ్లో॥ కర్మాశ్రిత స్సూర్యసుతః ప్రసూతే కుకర్మరక్తాం వనితా నుకారాం । కుశాస్త్రసంగవ్యసనాభిభూతాం నిసర్గదుష్టాం ధనవర్జితాం చ ॥ ౧౧॥

తా॥ దశమమందు శనియుండిన దుర్వ్యాపారములయందాసక్తి, స్త్రీస్వభావము, నిందితశాస్త్రాభ్యాసమునందిచ్ఛ, దుష్టస్వభావము, దారిద్ర్యంబును గలదిగనుండును.

శ్లో॥ లాభాశ్రితో భాస్కరజః ప్రసూతే నారీం సుపుత్రాం సుధనై స్సమేతాం। సురూపదేహాం వివిధాన్నపానాం ప్రభూతలాభాం భయవర్జితాం చ ॥

తా॥ ఏకాదశస్థానమునందు శనియుండిన సత్పుత్రులు, విశేషధనము, సౌందర్యము, బహువిధభోజనములు, విశేషలాభము, నిర్భయంబును గలదిగనుండును.

శ్లో॥ వ్యయస్థితో భాస్కరజః ప్రసూతే రక్తాధికాం వాతకఫప్రగల్భామ్ । వివేకహీనాం కుటిలస్వభావాం సదా నిరస్తాం వ్యసనాకులాం చ ॥ ౧౨॥



తా॥ ద్వాదశస్థానమునందు శనియుండిన రక్తాధిక్యము, వాతకఫరోగములు, అవివేకము, వక్రస్వభావము, వ్యాకులచిత్తంబునుగలిగి అందఱిచేత దిరస్కరింపఁబడునదియగును.

శ్లో॥ ఏతత్ఫలం స్త్రీషు విశేషత శ్చప్రోక్తం స్వభావే ఫలదం సదైవ । శేషం నరాణాం విధినా ప్రవాచ్యం హిత్వా తు యోగా న్నృపసంభవాం శ్చ ॥ ౧౩॥

తా॥ ఇపుడు చెప్పిన త్రింశాంశ నవాంశ లగ్నరాశి నక్షత్రభావఫలంబులన్నియు విశేషంబుగ స్త్రీలకనియె తెలియవలయు. ఇంక జెప్పఁబడు రాజయోగంబులు తప్ప ఇంకను మిగిలిన ఫలంబులను పురుషుల యొక్క విశేషవిధివలె నెఱుంగవలయును.

ఇతి శ్రీ వృద్ధయవనే స్త్రీజాతకే భావఫలాధ్యాయః.

---

## రాజయోగాధ్యాయము.

శ్లో॥ మూర్తౌ సురేజ్యోఽస్తగత శ్శశాంకోఽథవా స్వవర్గే గగనేచ శుక్రః । జాతాఽంత్యజానామపి మందిరేఽత్ర యోగే భవే త్పార్థివవల్లభా చ ॥ ౧॥

తా॥ లగ్నమునందు గురువు, సప్తమమునగాని స్వవర్గమునగాని చంద్రుడు, దశమమునందు శుక్రుడు నుండగాబుట్టిన స్త్రీ హీనజాతిదియైనను రాజపత్ని యగును.

శ్లో॥ కేంద్రేషు సౌమ్యాయది కల్యభాజః పాపాః కలత్రే చ మనుష్యరాశౌ। రాజ్ఞీ భవేత్ స్త్రీ బహుకోపయుక్తా నిత్యం ప్రశాంతాఽరిసుఖేన తుష్టా ॥ ౨॥

తా॥ శుభగ్రహములు, కేంద్రచతుష్టయంబునగాని, కేవలలగ్నమునం దుగానియుండి నరరాసులగు మిథున కన్యా తులా ధనుఃపూర్వార్ధ కుంభరాసులలోనొకటి సప్తమస్థానమై, యందుపాపగ్రహములుండఁగాఁ బుట్టినస్త్రీ - విశేషధనసంపత్తి, శాంతమైనచిత్తముకలిగి శత్రూపచారములచే సంతుష్టినొందెడి రాజపత్నియగును.

శ్లో॥ ఏకోఽపి జీవో రసవర్గశుద్ధః కేంద్రే యదా చంద్రనిరీక్షితశ్చ। రాజ్ఞీ భవేత్ స్త్రీ సుధనాత్ర జాతా వరేభదానాఙ్కితతంచదేశాః॥ 3॥

తా॥ వరాహమిహిరోక్త, త్రిదశ త్రికోణ, అను శ్లోకప్రకారము, చంద్రునికి 3-4-5-2-6-8-10 ఈస్థానములయందు షడ్వర్గశుద్ధుడైనగురువుండిచంద్రునిచేజూడబడుచుండగాఁబుట్టిన స్త్రీ విశేషధనవంతురాలై రాజపత్నియగును.

శ్లో॥ లాభాశ్రిత శ్శీతకరో భృగు శ్చ కళత్రగ స్సోమసుతేన యుక్తః। జీవేన దృష్టఃకురుతేఽత్ర రాజ్ఞీ లోకేస్తుతాపం దివరై స్సదైవ॥ 4॥

తా॥ లాభస్థానమునందు చంద్రుఁడును, శుక్రబుధులు కళత్రస్థానమందునుండి గురునిచే చూడఁబడుచుండఁగాఁబుట్టినస్త్రీ రాజపత్నియై వందిమాగధులచే స్తుతింపబడును.

శ్లో॥ బుధే విలగ్నే యది తుంగసంస్థే లాభాశ్రితో. దేవపురోహిత శ్చ। నరేంద్రపత్నీ వనితాత్రయోగే భవేత్ప్రసిద్ధా ధరణీతలేఽస్మిన్॥ 5॥

తా॥ జన్మలగ్నము కన్యాలగ్నమై అందు బుధుండును, లాభస్థానమునందుగురువునుండగా బుట్టినస్త్రీ రాజపత్నియై ప్రసిద్ధురాలగును.



శ్లో॥ తృతీయగ స్సోమసుతోఽంబుసంస్థ షడ్వర్గశుద్ధో యది దేవమంత్రీ। మూర్తౌ భృగుః పార్థివసమ్మతాం చ కరోతి నారీం బహువాజిబృందామ్॥ 6॥

తా॥ లగ్నమునందు శుక్రుడును, తృతీయమునందు బుధుడును, షడ్వర్గశుద్ధుడైనగురువు చతుర్థమందునుండఁగాఁ బుట్టినస్త్రీ రాజపత్నియై అనేకములైన అశ్వములుకలదియగును.

శ్లో॥ శీర్షోదయే సప్తమగే శశాంకే చతుష్టయే పాపవివర్జితే చ। రాజ్ఞీ భవే ద్భూరిగజాశ్వయుక్తా పతిప్రధానా విజితారిపక్షా॥ 7॥

తా॥ శీర్షోదయరాసులైన మిథున సింహ కన్యా తులా వృశ్చిక కుంభములలోనొకటి సప్తమస్థానమై దానియందు పూర్ణచంద్రుఁడుండి కేంద్రచతుష్టయము పాపగ్రహవర్జితముగనుండగాఁబుట్టినస్త్రీరాజపత్నియగుటయేకాక అనేకగజాశ్వములుకలదై పతికిఇష్టురాలై శత్రుజయముకలదియగును.

శ్లో॥ షడ్వర్గశుద్ధైస్త్రిభి రేవ రాజ్ఞీ చతుర్భి రీశస్య తథైవపత్నీ। పంచాదిభి ర్దేవవిమానభాజా త్రైలోక్యనాథ ప్రమదా తథా స్యాత్॥ 8॥

తా॥ జననకాలమునందు 3 గ్రహములు షడ్వర్గశుద్ధికలవియగుచుండఁగాఁబుట్టిన స్త్రీ రాజపత్నియగును. నాలుగుగ్రహములు షడ్వర్గశుద్ధికలవియగుచుండఁగాఁబుట్టిన స్త్రీ చక్రవర్తిభార్యయగును. అయిదుగ్రహములు షడ్వర్గశుద్ధికలవియగుచుండఁగాఁ బుట్టిన స్త్రీ దేవవిమానమును పొందుటయేకాక త్రైలోక్యనాథునకు భార్యయగును.

శ్లో॥ తుంగాశ్రితే శీతకరే సుఖస్థే జీవేన దృష్టే పరిపూర్ణదే
హే । విద్యాధరీవాత్ర భవే త్ప్రధానా రాజ్ఞీ జితారి
ర్బహుపుత్రపౌత్రా॥ ౯

తా॥ కుంభరాశి జన్మలగ్నమై దానికినాలుగవస్థానమైన వృషభ రాశియందు పూర్ణచంద్రుడుండి గురువుచేవీక్షింపబడుచుండఁగాఁబుట్టిన స్త్రీ విద్యాధరకన్యకగగాని - ప్రధానమైనరాజపత్నిగగానియుండి బహుపుత్రపౌత్రసంతతి, శత్రుజయంబునుకలదియగును.

శ్లో॥ స్వక్షేత్రగ స్సోమసుతోఽంబుసంస్థ షడ్వర్గశుద్ధస్సురగా
జమన్త్రీ । శుక్రేణ దృష్టః ప్రమదాం ప్రసూతే రాజ్ఞీం
మహాశబ్దసమన్వితాం చ ॥ ౧౦॥

తా॥ కన్యామిథునములలో నొకదానియందు బుధుఁడు షడ్వర్గశుద్ధుడైనగురువుచతుర్థమందుండి శుక్రునిచేఁ జూడఁబడుచుండఁగాఁ బుట్టినస్త్రీ మహారాజపత్నియగును.

శ్లో॥ వక్రి స్తృతీయే రిపుసంస్థితో వా షడ్వర్గశుద్ధో రవిజ శ్చ
లాభే । స్థిరే విలగ్నే గురుణా చ యుక్తే రాజ్ఞీ భవేత్
స్త్రీ పతివల్లభా చ॥ ౧౧॥

తా॥ జన్మలగ్నమునకు 3-౬ లలో అంగారకుఁడును, షడ్వర్గశుద్ధుడైన శని లాభస్థానమందునుండి స్థిరరాశిలగ్నమై గురువుచేజూడఁబడుచునుండగా జనించినవనిత రాజపత్నియై పతికిఇష్టురాలై యుండును.

శ్లో॥ ఆయస్థిత స్తీక్ష్ణకర స్స్వతుంగే మూర్తౌ శశాంకః పరి
పూర్ణదేహః । సౌమ్యోఽంబరస్థః కురుతే చ రాజ్ఞీం పతి
ప్రధానాం బహుపుత్రపౌత్రామ్॥



తా. మిథునరాశిజన్మలగ్నమై అందుఁ బూర్ణచంద్రుఁడును లాభస్థానమగు మేషరాశియందు సూర్యుఁడును దశమస్థానమైన మీనరాశియందు బుధుడునుఉండగాబుట్టినస్త్రీ రాజపత్నియగుటయేగాక పతియేముఖ్యుఁడుగాగలదై అనేకపుత్రపౌత్రసంతతి కలదియగును.

శ్లో॥ షడ్వర్గశుద్ధేదివసాధినాథే తృతీయగేసూర్యసుతేరిపుస్థే ।
భవేత్ప్రజాతాప్రమదాసురాజ్ఞీధర్మప్రధానాపతివల్లభా చ

తా॥ షడ్వర్గశుద్ధుఁడైనసూర్యుఁడు తృతీయమందును,శనైశ్చరుఁడు షష్ఠస్థానమందునుండగాఁబుట్టిన స్త్రీ రాజపత్నియగుటయే కాక ధర్మానుష్ఠానతత్పరురాలై పతిప్రేమాస్పదురాలగును. షడ్వర్గశుద్ధియనగా - హోరలో కుజాదిపంచగ్రహములకును, త్రింశాంశలోసూర్యచంద్రులకునుసంబంధము లేనందున గ్రహములకుసప్తమాంశముకూడగ్రహింపవలయును.

శ్లో॥ స్థిరేవిలగ్నే రసవర్గశుద్ధేసౌమ్యైనయుక్తేత్వథవేక్షితేవా ।
తుఙ్గాశ్రితేచైకతమేత్రరాజ్ఞీవరేభబృన్దానుగతాయథాస్యాత్

తా॥ షడ్వర్గశుద్ధుఁడైన సూర్యుఁడు శుభగ్రహముతోఁగూడికాని లేకవీక్షితుఁడై కాని స్వోచ్ఛరాశియగు మేషమునందుండునపుడు జన్మలగ్నము స్థిరరాశియగుచుండఁగా జన్మించినస్త్రీరాజపత్నియై శ్రేష్ఠమైనగజములతోకూడియుండును.

శ్లో॥ యస్యాబుధస్తుంగగతోవిలగ్నేలాభస్థలేదేవపురోహితశ్చ
ధనేఽస్తిశుక్రోదశమేశశాంకస్సాసార్వభౌమస్యపధూర్భవిత్రీ॥

తా॥ కన్యారాశి జన్మలగ్నమై అందు బుధుఁడును, లాభస్థానమందు గురువును, ధనస్థానమునందుశుక్రుడును, దశమస్థానమునందుసంపూర్ణచంద్రుడునుండగాజన్మించినస్త్రీ చక్రవర్తిభార్యయగును.

ఇతిశ్రీవృద్ధయవనే స్త్రీజాతకే రాజయోగాధ్యాయస్సమాప్తః

---

## యోగచతుష్టయ వివరణము, సౌభాగ్యయోగము.

శ్లో॥ స్మరేశే లగ్నరాశిస్థే లగ్నేశేన సమన్వితే।
భృగుపుత్రేణ సందృష్టే యోగస్సౌభాగ్యసంజ్ఞికః ౧॥

తా॥ సప్తమాధిపతి లగ్నమందుండి లగ్నాధిపతితోచేరి శుక్రునిచే జూడఁబడియేనేని సౌభాగ్యయోగము.

శ్లో॥ స్మరేశే స్మరరాశిస్థే లగ్నేశేన సమన్వితే।
సందృష్టే గురుచంద్రాభ్యాం యోగస్సౌభాగ్యసంజ్ఞికః

తా॥ సప్తమాధిపతి సప్తమమందుండిలగ్నాధిపతితో చేరి గురుచంద్రులచేజూడఁబడినను సౌభాగ్యయోగము,

శ్లో॥ స్మరేశే స్వోచ్చరాశిస్థే లగ్నేశే లగ్నసంయుతే।
బహుసౌభాగ్యసంపత్తిర్యోగస్సౌభాగ్యసంజ్ఞికః ౩

తా॥ సప్తమాధిపతి తనఉచ్చస్థానమందుండి లగ్నాధిపతి లగ్నంబుననుండిన నధికసుఖంబుగలుగఁజేయు సౌభాగ్యయోగము.

శ్లో॥ లగ్నేశే పరమోచ్చస్థే స్మరేశే స్మరవీక్షితే।
శుభైస్సంవీక్ష్యతే కేంద్రే యోగస్సౌభాగ్యసంజ్ఞికః॥

తా॥ లగ్నాధిపతి తనపరమోచ్చంబునందుండి సప్తమాధిపతి సప్తమంబునుజూచుచుండి శుభగ్రహంబులు కేంద్రంబులలోనుండినను సౌభాగ్యయోగము.

శ్లో॥ స్మరస్థానాధిపే స్వోచ్చే కేంద్రే కోణంగతేఽథవా।
శుభగ్రహేణ సందృష్టే యోగస్సౌభాగ్యసంజ్ఞికః॥ ౪॥

తా॥ సప్తమాధిపతిస్వోచ్చమందుండినను, లేక, స్వమూల త్రికోణములందుగాని, స్వక్షేత్రంబులందుగానియుండినను, సౌభాగ్యయోగమనబడు



## సాహచర్యయోగము.

శ్లో॥ స్మరలగ్నాధిపే షష్ఠే రిష్ఫే షష్ఠాస్తపే యది।
ఏకాంశ ఏకఋక్షే చ సహచారీ భవిష్యతి॥ ౧॥

తా॥ సప్తమాధిపతి ౬ లోనుండినను, షష్ఠసప్తమాధిపతులు ౧౨ లోనుండినను ఒకఅంశముననొకనక్షత్రముననుండినను సాహచర్యయోగము

శ్లో॥ స్మరస్థానాధిపే లగ్నే రిష్ఫే షష్ఠాధిపే స్మరే।
అన్యోన్యదృష్ట ఏకాంశే సహచారీ భవిష్యతి॥ ౨॥

తా॥ సప్తమాధిపతి లగ్నంబునను ఆఱవయింటికిఅధిపతి ౧౨ లోగాని ౭ లోగానియుండి ఒకరొకరిని చూచినను ఒకనవాంశమందుండినను సాహచర్యయోగము,

శ్లో॥ స్మరలగ్నాధిపే చంద్ర అంత్యాంశే అంత్యరాశిగే।
షష్ఠేశ్వరేణ సంయుక్తే సహచారీ భవిష్యతి॥ ౩॥

తా॥ సప్తమాధిపతి చంద్రుఁడై అంత్యనవాంశములయందుగాని అంత్యరాసులయందుగానినిలిచి ఆఱవయింటికిఅధిపతిచేత చూడబడియేనేని మూడవసాహచర్యయోగము.

శ్లో॥ స్మరస్థానాధిపే కేంద్రే ఏకాంశే రిపురాశిగే।
అంత్యేశ్వరేణ సందృష్టే సహచారీ భవిష్యతి॥
యోగే సాచర్యకే జాతా సా నారీ సురపూజితా।
సత్యశీలా మహాశ్రేష్ఠా పాతివ్రత్యగుణాన్వితా॥

తా॥ సప్తమాధిపతి ౧-౪-౭-౧౦ స్థానంబులలోనుండిషష్ఠాధిపతి నవాంశమున షష్ఠాధిపతితో కూడి ౧౨ కు అధిపతిచేతచూడబడియేనేని నాలుగవసాహచర్యయోగము-ఇట్టిసాహచర్యయోగమునజనించిన యువతి పతివ్రతయు, సత్యవ్రతయునగుచు దేవతలచేత పూజింపబడునదియగును.

## వైధవ్యయోగము.

శ్లో॥ స్మరేశే రంధ్రరాశిస్థే రంధ్రేశేన సమన్వితే।
పాపగ్రహేణ సందృష్టే యోగో వైధవ్యసంజ్ఞికః॥

తా॥ సప్తమాధిపతి అష్టమాధిపతితోఁ జేరి అష్టమమందుండి పాపగ్రహములచేత చూడబడియెనేని వైధవ్యయోగము ప్రథమము.

శ్లో॥ స్మరరాశింగతే రాహౌ స్మరేశే రవిసంయుతే।
రంధ్రేశ్వరేణ సందృష్టే యోగో వైధవ్యసంజ్ఞికః॥

తా॥ సప్తమమందు రాహువుండి సప్తమాధిపతికి సూర్యసంబంధముకలిగి అష్టమాధిపతిచేతచూడబడియెనేని వైధవ్యయోగము.

శ్లో॥ స్మరేశే శనిసంయుక్తే భూమిపుత్రేణ వీక్షితే।
చంద్రరాహుయుతే రంధ్రే యోగో వైధవ్యసంజ్ఞికః॥

తా॥ సప్తమాధిపతి శనితోఁ జేరి అంగారకునిచేతచూడబడి యెనిమిదింట చంద్రరాహువులుండిన నిది మూడవవైధవ్యయోగము.

శ్లో॥ నైధనస్థే యదా భౌమే స్మరేశేన సమన్వితే।
లగ్నే పాపాంశసంయుక్తే యోగో వైధవ్యసంజ్ఞికః॥

తా॥ అష్టమమందంగారకుడుండి సప్తమాధిపతితోఁ గూడియుండినను, లగ్నము పాపనవాంశమునొందినను వైధవ్యయోగము.

శ్లో॥ శనిభౌమైర్యుతో రాహుః స్మరే రంధ్రగతేపివా।
బాల్యే వైధవ్యసంప్రాప్తి ర్యోగో వైధవ్యసంజ్ఞికః॥

తా॥ రాహువు శన్యంగారకులతోఁ గూడి ౭ లోఁగాని, ౮ లోఁగాని యుండెనేని బాల్యమునందె వైధవ్యంబుగలుగు.

శ్లో॥ యోగే వైధవ్యకే జాతా అశుభైర్లక్షణైర్యుతా।
వైధవ్యం ప్రాప్నుయాన్నారీ సా దౌర్భాగ్యగుణాన్వితా॥

తా॥ ఇట్టి వైధవ్యయోగములలోఁ బుట్టిన స్త్రీ అశుభలక్షణములతోఁ గూడియుండెనేని దౌర్భాగ్యగుణములుగలదగుచు విధవాత్వమునొందును.

---



## ఋతుఫలాధ్యాయము.

శ్లో॥ అనుపచయస్థే చంద్రే ధరణీసుతవీక్షణా ద్వాపి
ప్రథమరజోదర్శనత శ్శుభం భవతి వనితానామ్॥

తా॥ చంద్రుఁడు రజోలగ్నమున కుపచయస్థానములగు తృతీయ షష్ఠ లాభముల యందు లేకుండు నపుడును, రజోలగ్నమునకు అంగారకవీక్షణము కలుగునపుడును స్త్రీలకు ప్రథమరజోదర్శనమైనయెడల శుభంబుకలుగును.

### తిథిఫలము.

శ్లో॥ సంతానహీనా ప్రతిపద్దినేచ భవేద్ద్వితీయే ఒల్పసుఖాతృతీయే। సమస్తసౌభాగ్యవతీ చతుర్థ్యాం పాపాలయా భోగవివర్జితా చ॥ పంచమ్యాం బహుపుత్ర భోగసహితా షష్ఠ్యాం తు దుర్భాషిణీ, సప్తమ్యాం ధనధాన్యభూషణయుతా శౌర్యాన్వితాప్యష్టమే। దుఃఖార్తా నవమే దినే హ్ని దశమే సౌభాగ్యయుక్తాపరా, శుద్ధారుద్రదినే తథార్కదివసే స్యాద్దూషిణీ సర్వదా॥ త్రయోదశ్యాంతు సంతుష్టా భూతాయాం పాపినీ భవేత్। పూర్ణిమాయాం తు సంపుష్టా చామాయా మల్పభోగినీ॥

తా॥ పాడ్యమినాడు రజస్వలయైనకన్య సంతానము లేనిదియు, విదియయందు అల్పసౌఖ్యముకలదియు, తదియయందు సకలైశ్వర్యములుగలదియు, చవితినాడు పాపముకలదియు, భోగసుఖములు లేనిదియు, పంచమియందు అనేకపుత్రికాపుత్రులునుభోగమును కలదియు, షష్ఠియందు దుష్టవాక్యములబలుకునదియు, సప్తమియందు ధనధాన్యాభరణంబులుకలదియు, అష్టమియందు మిక్కిలిశౌర్యము కలదియు, నవమియందు దుఃఖముచే పీడింపఁబడునదియు, దశమియందు సౌభాగ్యవతియు, శ్రేష్ఠురాలును, ఏకాదశియందు శుచిర్భూతురాలును, ద్వాదశియందు ఎల్లప్పుడు పరులదూషించునదియు

త్రయోదశియందు సంతోషవతియు, చతుర్దశియందు పాపాత్మురాలును, పున్నమయందు శరీరపుష్టికలదియు, అమావాస్యయందు స్వల్పభోగములుకలదియు నగును.

## దుష్టతిథ్యాదులు.

శ్లో॥ అమారిక్తా ఒష్టమీ షష్ఠీ ద్వాదశీప్రతిపత్స్వపి ।
పరిఘస్య చ పూర్వార్థే వ్యతీపాతే చ వైధృతౌ ॥
సంధ్యాసూపప్లవే విష్ట్యా మశుభం ప్రథమార్తవమ్ ॥

తా॥ అమావాస్యయందును, రిక్తతిథులయందును, ఉభయాష్టములయందును, ఉభయషష్ఠులయందును, ఉభయ ద్వాదశులయందును, ఉభయ ప్రతిపత్తులయందును, పరిఘనామయోగముయొక్క పూర్వభాగమందును, వ్యతీపాతనామయోగమునందును, వైధృతినామయోగమునందును, సంధ్యాకాలములయందును, అశనిపాతము మొదలయినయుత్పాతకాలములయందును, భద్రవాకరణమునందును, స్త్రీలుతొలిసమర్తాడిన నశుభకరము.

## వారఫలము.

శ్లో॥ రోగిణీ రవివారే చ సోమవారే పతివ్రతా ।
దుఃఖితా భౌమవారే తు బుధే సౌభాగ్యసంయుతా ।
శ్రీసంయుతా గురోర్వారే పతిభక్తిర్భృగోర్దినే ।
మలినా మందవారే తు రాత్రావపి తథైవ చ ॥

తా॥ ఆదిత్యవారమునందు బుష్పించినకన్యక వ్యాధిపీడితురాలగును. సోమవారమునందు పతివ్రతయు, మంగళవారమునందు దుఃఖవంతురాలును, బుధవారమునందు సౌభాగ్యవతియు, గురువారమునందు సంపన్నురాలును, శుక్రవారమునందు పతిభక్తికలదియు, శనివారమునందు కలుషస్వభావముకలదియు నగును.



## శుభనక్షత్రములు.

శ్లో॥ కరాదిపంచోత్తరగమూలపూష విష్ణుత్రయాశ్వీజ్యవిధీందుభేషు । ఆద్యంరజస్స్యాఖ్యసుతాయురర్థం సౌభాగ్యవృద్ధిం కురుతేఽంగనానామ్ ॥

తా॥ హస్త-చిత్త-స్వాతి-విశాఖ-అనూరాధ-ఉత్తర- ఉత్తరాషాఢ- ఉత్తరాభాద్ర - మూల - రేవతి - శ్రవణము - ధనిష్ఠ - శతభిషము, ఆశ్విని - పుష్యమి - రోహిణి - మృగశిర యీనక్షత్రములయందు రజస్వలయైనయెడల సౌఖ్యము, పుత్రులు, ఆయుష్యము, ధనంబును, సౌభాగ్యంబును కలుగును.

## దుష్టనక్షత్రములు.

శ్లో॥ పూర్వాత్రయే యామ్యభుజంగధిష్ణ్యే తామ్బూలతైలం కుసుమం హరిద్రాం । తద్భర్తృసందర్శనమేవ వర్జ్యం తాత్కాలికం శాంతివిధిం ప్రకుర్యాత్ ॥ రౌద్రే మఖే శోకయుతా దితేర్భే సా బంధకీంద్రే హ్యనలే దరిద్రా ॥

తా॥ పుబ్బ - పూర్వాషాఢ- పూర్వాభాద్ర - భరణి - ఆశ్లేషయీనక్షత్రములయందు రజస్వలయైనయెడల - తాంబూలచర్వణమును, తైలాభ్యంగమును, పుష్పధారణమును, హరిద్రాలేపనమును, పెనిమిటినిజూచుటయును, ఆయానక్షత్రమునకుఁ జెప్పఁబడినమాసపర్యంతము వర్జింపవలయు మఱియు నా రజోదర్శన కాలోచితమైన శాంతికర్మవిధానమునుం జేయవలయు - ఆర్ద్ర, మఖ యీనక్షత్రములయందు రజోవతియైన స్త్రీ దుఃఖవతియు, పునర్వసు- జ్యేష్ఠ వీనియందు వ్యభిచారియు, కృత్తికానక్షత్రమునందు దరిద్రురాలు నగును.

శ్లో॥ కృత్తికాదిత్యరౌద్రేఽపి మఖాజ్యేష్ఠే రజస్వలా ।
ఆదిపాదే శుభం ప్రోక్తం సా కన్యా మంగళప్రదా ॥
ద్విపాదే చే ద్రజోదృష్టం పంచవింశతిభోజనం ।
త్రిపాదే చ చతుష్పాదే శాంతిం కుర్యా ద్యథావిధి॥

తా॥ కృత్తిక, పునర్వసు, ఆర్ద్ర, మఖ, జ్యేష్ఠ, యీనక్షత్రములయందు ప్రథమపాదమునందు రజస్వలయైనయెడల శుభకరము; రెండవపాదమునందైనయెడలదచ్ఛాంతికొఱకునిరువదియైదుగురికి షడ్రసోపేతంబుగా భోజనంబు బెట్టవలయు, మూడవపాదమునందును నాలవపాదమునందునైనయెడల శాస్త్రమునందుఁ జెప్పఁబడియుండుప్రకారము శాంతిచేయవలయు.

శుభనక్షత్రఫలము.

శ్లో॥ ధనిష్ఠావిష్ణుమూలాసు నార్యా స్స్యా త్సుతపంచకమ్ ।
మృగోత్తరకరత్వష్ట్రశతతారాసు వై దశ ।
ద్విదైవస్వాతిమూలాశ్విమైత్రేషు చ సుతాష్టకం ।
ప్రాజాపత్యే సుతా స్సప్త చాంత్యే చ నవకం భవేత్ ॥

తా॥ శ్రవణము, ధనిష్ఠ, మూలయీనక్షత్రంబులయందురజస్వలయైన స్త్రీకి ఐదుగురు పుత్రులును, మృగశిర, ఉత్తర, ఉత్తరాషాఢ ఉత్తరాభాద్ర, హస్త, చిత్త, శతభిషము, అనునీనక్షత్రముల యందైన యెడల పదుగురుపుత్రులును, విశాఖ స్వాతి, మూల అశ్విని, అనూరాధ యీనక్షత్ర ములయందు ఎనమండ్రుపుత్రులును, రోహిణియందు ఏడ్గురుపుత్రులును, రేవతియందుదొమ్మండ్రు పుత్రులును కలుగుదురు.

దుష్టనక్షత్రఫలము.

శ్లో॥ పూర్వాత్రయే దరిద్రాస్స్యా త్కృత్తికాయాంతు దుర్భగా।
ఆర్ద్రాయాంపుత్రనాశస్స్యా ద్భరణ్యాంస్వమృతిర్భవేత్॥
మఖాయాంభర్తృనాశస్స్యా త్సార్పే చాండాలగామినీ।
దరిద్రిణీ చ జ్యేష్ఠాయాం రతిహీనా చ జాయతే॥



తా॥ పుబ్బ, పూర్వాషాఢ, పూర్వాభాద్ర వీనియందు రజస్వలయైన కన్యక దరిద్రురాలును, కృత్తికయందుదౌర్భాగ్యురాలును, ఆర్ద్రయందు పుత్రసంతానములేనిదియు, భరణియందు మృతురాలును, మఖయందు పతివియోగము కలదియు, ఆశ్లేషయందు చండాలపురుషులతో విహరించునదియు, జ్యేష్ఠయందు దరిద్రురాలును, సురతవిహీనురాలును అగును.

శ్లో॥ పూర్వాత్రయే భుజంగర్క్షే యామ్యర్క్షే చ రజస్వలా।
ప్రథమాంశే పతిఘ్నీ స్యా ద్ద్వితీయే మృతపుత్రకా ।
తృతీయే తు దరిద్రా స్యా చ్చతుర్థే త్వశుభావహా ॥

తా॥ పుబ్బ, పూర్వాషాఢ, పూర్వాభాద్ర, ఆశ్లేష, భరణియీనక్షత్రములయందు మొదటిపాదమునందు రజోవతియైనయెడల మగనినిచంపునదియు, రెండవపాదమునందైనయెడల చనిపోయెడు పుత్రసంతానము గలదియు, మూడవపాదమునందు భాగ్యహీనురాలును, నాలవపాదమునందు అమంగళకరురాలును అగును.

శ్లో॥ భరణ్యాం దశమాసం తు త్రిపూర్వే చాష్టకం తథా ।
మఖాయాం ద్వాదశైవ స్యు ష్షాణ్మాసం రౌద్ర భే తథా
జ్యేష్ఠాశ్లేషాకృత్తికాసు మతం మాసచతుష్టయం ॥
పునర్వసౌ పంచ మాసా ఇత్యేతే భర్తృదర్శనే ॥

తా॥భరణీనక్షత్రమునందు రజస్వలయైనయెడల ౧౦ మాసములును, కృత్తిక, ఆశ్లేష, జ్యేష్ఠవీనియందు ౪ మాసములును పుబ్బ పూర్వాషాఢ, పూర్వాభాద్రవీనియందు ౮ మాసములును, ఆర్ద్రయందు ౬ మాసములును, మఖయందు ౧౨ మాసములును, పునర్వసునందు ౫ మాసములును, భర్తృదర్శనమును, తాంబూలచర్వణాదులను వర్జింపవలయు, పిదప నాయానక్షత్రశాంతిని శాస్త్రోక్తప్రకారముచేయవలయు.

## యోగఫలము. కరణఫలము.

విష్కంభమునందు రజస్వలయైనకన్య వ్యసనముకలదియు, ప్రీతియందు సంతోషవంతురాలును, ఆయుష్మానునందు దీర్ఘాయుష్యము కలదియు, సౌభాగ్యమునందు విశేషసంపదకలదియు, శోభనయోగమునందు శుభకరురాలును, అతిగండమునందు పాపకృత్యముకలదియు, సుకర్మమునందు సౌఖ్యముకలదియు, ధృతియందు ధైర్యస్థైర్యములుకలదియు, శూలయందు దుర్మరణముకలదియు, గండమునందు పాపకృత్యము కలదియు, వృద్ధియందు సంతుష్టచిత్తముకలదియు, ధ్రువమునందు పతివ్రతయు, వ్యాఘాతమునందు విధవయు, వజ్రమునందు సౌభాగ్యవంతురాలును, సిద్ధియందు సకలసంపదలుకలదియు, వ్యతీపాతమునందు దుఃఖవంతురాలును, వరియానునందు సదాదైవచింతకలదియు, శివమునందు మంచిమనస్సుకలదియు, సిద్ధమునందు సంపదకలదియు, సాధ్యమునందు సర్వభోగములు గలదియు, శుభమునందు సంతోషముకలదియు, శుభ్రమునందు మంచికీర్తికలదియు, బ్రాహ్మమునందు పాపకృత్యములుకలదియు, మహేంద్రమునందు రోగాలచేమరణముకలదియు, వైధృతియందు హత్యచేయుస్వభావముకలదియు నగును.

బవకరణమునందు రజస్వలయైన కన్య సౌఖ్యవతియు, బాలవయందు సౌభాగ్యవతియు, కౌలవయందు సౌందర్యవతియు, తైతులయందు దాక్షిణ్యముకలదియు, గరజియందు వైధవ్యముకలదియు, వణజియందు విశేషదానముచేయునట్టి స్వభావముకలదియు, భద్రయందు ప్రీతికరురాలును, చతుష్పాత్తునందు అసంతుష్టికలదియు, నాగవమునందు అప్రీతికరురాలును, కిమస్తుఘ్నమునందు దరిద్రురాలును అగును,

## ఆర్తవలగ్న శుభాశుభఫలము.

శ్లో॥ మేషే తు వ్యభిచారీస్యా ద్వృషభే సౌఖ్యసంయుతా।
మిథునే స్యాత్పుత్రవతీ కర్కటే చాతిజారిణీ ॥



సింహే పుత్రవతీ నారీ కన్యాయాం శ్రీమతీ భవేత్ ।
భాగ్యయుక్తా తులాయాం చ వృశ్చికే వ్యభిచారిణీ ॥
దుశ్చరీ ధనుషఃపూర్వే అపరే తు పతివ్రతా ।
మకరే మానహీనా స్యాత్కుంభే ధనవతీ భవేత్ ।
మీనే పుత్రవతీ చైవ ప్రథమర్తా విదం ఫలమ్ ॥

తా॥ మేషలగ్నమునందు రజస్వలయైనకన్య వ్యభిచారియు, వృషభమునందు సౌఖ్యవృద్ధికలదియు, మిథునమునందు పుత్రవంతురాలును, కటకమునందుమిక్కిలి జారసాంగత్యముకలదియు, సింహమునందు సత్పుత్రవంతురాలును, కన్యాలగ్నమునందుసంపద్యుక్తురాలును, తులాలగ్నమునందుభాగ్యవంతురాలును, వృశ్చికలగ్నమునందు వ్యభిచారము కలదియు, ధనుర్లగ్నముయొక్కపూర్వభాగమునందు జారిణియు, ధనుస్సుయొక్క ఉత్తరభాగమునందైనయెడల పతివ్రతయు, మకరలగ్నమునందు మానాభిమానములు లేనిదియు, కుంభమునందు ధనధాన్యసమృద్ధికలదియు, మీనలగ్నమునందు పుత్రవంతురాలును అగును.

## రజోదర్శనస్థాననిర్ణయము.

శ్లో॥ మేషేపిసింహేపిచకన్యకాయాం గ్రామస్యబాహ్యేప్రథ
మార్తవంస్యాత్ । వృషేచగోష్ఠేధనుషిస్వగేహేగ్రామే
ధ్యేఽన్యస్యగృహేఽంగనాయాం॥ మీనేమృగేకర్కటకే
ఘటేఽం బుతీరేన్నృయుగ్మే తు దిగంబరా స్యాత్ ।
వనస్యమధ్యేప్యథవృశ్చికేచ గర్గాదయో ఏవముదీరయన్తి॥

తా॥ మేషమునందును, సింహరాశియందును, కన్యారాశియందును, గ్రామమునకు వెలుపట ప్రథమరజోదర్శనమగుననియు, వృషభలగ్నమునందు గోస్థానమందనియు, ధనుర్లగ్నమునందు తనయింటిలోనననియు, తుల

యందు స్వగ్రామమునందన్యునిగృహములోననియు, మీనరాశియందును, మకరమునందును,కర్కాటకరాశియందును,కుంభరాశియందునుజలసమీపమునందనియు, మిథునమునందైనయెడల దిసమొలగనుండునపుడనియు,వృశ్చికరాశియందైనయెడల అరణ్యమధ్యంబునందనియు పృచ్ఛకునకు దైవజ్ఞుండుచెప్పవలయు.

## రజోదర్శనస్థానఫలము.

శ్లో॥ గ్రామబాహ్యేపరగ్రామే సాస్త్రీ స్యాద్వ్యభిచారిణీ ।
పతివ్రతా పశుస్థానే సుజీవా గృహమధ్యమే ॥
గ్రామమధ్యే సువృద్ధి స్స్యాద్విధవా స్యాద్దిగమ్బరా ।
అన్యస్యగేహే దుశ్శీలా దీర్ఘాయుర్జలసన్నిధౌ ॥
వనమధ్యే తు సౌభాగ్యధనధాన్యసమన్వితా ।

తా॥ గ్రామంబునకు బహిఃప్రదేశమందును అన్యగ్రామమునందును రజోవతియైన స్త్రీ వ్యభిచారముకలదియు, గొడ్లదొడ్డియందైన పాతివ్రత్యముగలదియు, స్వకీయగృహాభ్యంతరమునందైనయెడల సమీచీనమైనజీవనముగలదియు, స్వగ్రామమధ్యమునందైనయెడల మిక్కిలివృద్ధిచేనొప్పుచుండునదియు, దిసమొలతోరజస్వలయైనపడతి వైధవ్యముబొందునదియు, పరగృహమునందైన దుష్టస్వభావముకలదియును, జలసమీపమునందైన - దీర్ఘాయుష్మంతురాలును, అరణ్యమధ్యంబునందైనయెడల ధనధాన్యైశ్వర్యములతోఁగూడియుండునదియునగునని పృచ్ఛకునికి జెప్పవలయు.

## ఆర్తవనక్షత్రగ్రహప్రయుక్తఫలము.

శ్లో॥ ప్రథమార్తవనక్షత్రే సమహీజే మృతప్రజా ।
జ్ఞశుక్రసహితే వంధ్యా సగురౌ స్యాత్తపస్వినీ ॥
సాదిత్యే తు పతిఘ్నీ స్యాద్రాహుయుక్తే తు జారిణీ ।
శనౌ తిష్ఠతిచేద్దాసీ గ్రహహీనే సువాసినీ ॥



తా॥ ఋతువైననక్షత్రమునందు అంగారకుఁడుండినయెడల చచ్చిపోయినసంతానముకలదియు, బుధశుక్రులుండినయెడల గొడ్రాలును, బృహస్పతియున్నయెడల తపోవంతురాలును,సూర్యుడుండిన పెనిమిటినిజంపునదియు, రాహువుండినయెడల జారులుకలదియు, శనియుండినదాస్యముచేయునదియు,ఏగ్రహమునులేకయుండినదీర్ఘసౌమంగల్యముగలదియునగును.

## ఆర్తవలగ్నగ్రహఫలము.

శ్లో॥ కేంద్రత్రికోణాయధనస్థితా శ్చ శుభా స్త్రిషష్ఠాయగతా
శ్చ పాపాః। శుభప్రదా స్స్యుః ప్రథమర్తుకాలే తథా విధి
జ్ఞా జగు రార్యవర్యాః॥

తా॥ స్త్రీలకు ప్రథమరజోదర్శనకాలంబునందు - కేంద్ర - త్రికోణ-లాభస్థానంబులయందు శుభగ్రహంబులును, తృతీయ- షష్ఠ-లాభస్థానంబులయందు క్రూరగ్రహంబులు సుండినయెడల మిక్కిలిశుభకరము.

శ్లో॥ అష్టమస్థే నిశానాథే భర్తుర్నైధనకారకమ్ ।
చంద్రతారాబలయుతే రజఃపుత్రార్థసంపదః ।
లగ్నాద్వా జన్మలగ్నాద్వా భూమిజేవాథవా విధౌ ।
సత్పుత్రా ప్రథమర్తౌ స్యాత్కన్యాచోపచయే స్థితే ॥

తా॥ చంద్రుఁడు రజోదర్శనలగ్నంబునకు అష్టమస్థానమందుండినయెడలపతినాశకరురాలగును. చంద్రతారాబలసంపన్నంబులగునపుడుపుత్రధనసంపత్తులుకలదియగును. రజోలగ్నంబునకుగాని- జన్మలగ్నమునకుగాని అంగారకుఁడైనను,చంద్రుడైనను తృతీయషష్ఠ దశమలాభస్థానంబులజెందియుండఁగా సమర్తాడినకన్యకసద్గుణసంపన్నులగుకొమరులుకలదియగును.

## సప్తమస్థానఫలము.

రజోదర్శనలగ్నంబునకుసప్తమస్థానమున సూర్యుఁడుండినవైధవ్యము,చంద్రుఁడుండిన పుత్రసంపద, అంగారకుడుండినవ్యభిచారము,బుధుఁడుం

డిన వంధ్యాత్వము, గురువుండినదారిద్ర్యము, శుక్రుడుండిన విదేశగమనము శనియుండినవ్యాధి, రాహువుండిన జారత్వము, కేతువుండిన బంధువిరోధం బును కలదిగనుండును.

కాలఫలము.

శ్లో॥ పుష్పవత్యా శ్శుభం ప్రాతః పూర్వాహ్ణే తీర్థగామినీ ।
మధ్యాహ్నే సుతసౌభాగ్యా చాపరాహ్ణే తు జారిణీ ॥
సాయాహ్నే బహుసత్నీస్స్యాత్సంధ్యయో ర్వేశ్యతాం వ్రజేత్
పూర్వరాత్రే చిరాయు స్స్యా న్నిశీథే విధవా భవేత్॥
నిశాంతే సుఖహీనా స్యా ద్దుర్భగా సర్వసంధిషు ॥

తా॥ ప్రాతఃకాలమందు రజస్వలయైనకన్యకమంగళకరురాలగును. పూర్వాహ్ణమునందైనయెడల దివ్యక్షేత్రముల సేవించునదియు, మధ్యాహ్నమునందైనయెడల పుత్రధనములుకలదియు, పగటియుత్తరభాగమునందు వ్యభిచరించునదియు, సాయంకాలమందైనయెడల పెక్కండ్రు పెనిమిటుల కలదియు, సాయంప్రాతస్సంధ్యలయందైన భోగపుచానతనముకలదియు, పూర్వరాత్రియందైన యెడల మిక్కిలిఆయుస్సుకలదియు, అర్ధరాత్రియందైన యెడల వైధవ్యముజెందునదియు, ఉషఃకాలమునందైన సౌఖ్యము లేనిదియు, ఇట్లుచెప్పంబడిన సర్వసంధికాలములయందును దౌర్భాగ్యము కలదియు అగును.

దిక్ఫలము.

శ్లో॥ శైలచంద్రాష్ట జలధి రసాక్షినవదిక్క్రమాత్ ।
ప్రాగాదిస్స్యాత్ ప్రజాసంఖ్యా బాలికాప్రథమార్తవే ॥

తా॥ కన్యకకు ప్రథమరజోదర్శనమునందు పృచ్ఛకుడు తూర్పు దిక్కునుండిపృచ్ఛచేసినయెడలఏడ్వురపుత్రులనియు,ఆగ్నేయదిక్కునుండి అడిగిన నొక్కపుత్రుడనియు, దక్షిణదిక్కునుండియడిగిన యెనమండ్రు



పుత్రులనియు, నైరృతినుండియడిగిన నల్వురపుత్రులనియు, పడమటి నుండియడిగిన నాలుగురుపుత్రులనియు, వాయవ్యమునుండి అడిగినయిద్దఱు పుత్రులనియు, ఉత్తరమునుండియడిగిన దొమ్మండ్రుపుత్రులనియు, ఈశాన్యదిశయందుండియడిగినపదుగురుపుత్రులనియు దైవజ్ఞుండుచెప్పవలయు.

ఆర్తవవస్త్రనిర్ణయము.

శ్లో॥ మేషసింహోక్షచాపానా ముదయే ధవళాంబరా ।
అలికర్కటనక్రాణా ముదయే మలినాంబరా ॥
ఘటయుగ్మాంగనాతౌలిలగ్నే రక్తయుతాంబరా ।
పృచ్ఛకాలే భవ త్యేవం బాలికాప్రథమార్తవే॥

తా॥ కన్యకరజోవిషయమై పృచ్ఛకుడు మేషము - వృషభము సింహము - ధనుస్సు - ఈలగ్నములయందు ప్రశ్న చేసినయెడల తెల్లని వస్త్రము ధరించినది యనియు,వృశ్చికము కటకము మకరముఅనునీరాసుల యందు ప్రశ్నచేసినయెడల మాసినబట్టకట్టుకొనినదనియు, కుంభము - మిథునము - కన్య- తుల- అనునీలగ్నములయందు ప్రశ్నచేసినయెడల ఎఱ్ఱని వస్త్రము ధరించినదియనియు చెప్పవలయును. (తూర్పునుండిపృచ్ఛచేసిన యెడల చినిగిపోయినవస్త్రమనియు, ఆగ్నేయమునుండియైన నల్లనివస్త్రమనియు, దక్షిణమునుండియైన నెఱ్ఱని వస్త్రమనియు, నైరృతినుండియైన తెల్లనివస్త్రమనియు, పడమటియందుండియైన మాసినవస్త్రమనియు, వాయవ్యదిశయందుండిఅయిన కాషాయవస్త్రమనియు,ఉత్తరమునందుండియైన చిత్రవర్ణవస్త్రమనియు, ఈశాన్యదిశయందుండి ప్రశ్నచేసినయెడల కావి మొదలగువన్నెగల వస్త్రమనియు జెప్పవలయునని గ్రంథాంతరమునందు జెప్పియున్నది.)

ఆర్తవకాలధృతవస్త్రఫలము.

శ్లో॥ సుభగా శ్వేతవస్త్రా స్యా ద్దృఢవస్త్రా పతివ్రతా ।
క్షౌమవస్త్రా క్షితీశా స్యా న్నవవస్త్రా శుభాన్వితా॥

దుర్భగా జీర్ణవస్త్రా స్యాద్రోగిణీ రక్తధారిణీ ।
నీలాంబరధరా నారీ విధవా పుష్పిణీ భవేత్ ।
మలినాంబరసంవీతా దరిద్రా స్యాద్రజస్వలా ।
దృష్టవస్త్రఫలం సమ్యగ్గదితం మునిపుంగవైః ॥

తా॥ తెల్లనిబట్టకట్టుకొని రజస్వలయైనచిన్నది సౌభాగ్యవతియును, గట్టిబట్టకట్టుకొనినది - పతివ్రతయు, పట్టుపుట్టమునుగట్టుకొని పుష్పించినపడతుక పట్టపురాణియు, క్రొత్తవస్త్రమునుధరించినది శుభసంపన్నురాలును, శిథిలమైనవస్త్రమునుధరించినది దౌర్భాగ్యవంతురాలును, ఎఱ్ఱనిపుట్టముగట్టుకొనినది వ్యాధిగ్రస్తురాలును, నీలవస్త్రధారిణియై పుష్పించిన స్త్రీ విధవరికమునుబొందునదియు అగునని ఋషులువచించెదరు.

## రజోబిందునిర్ణయము.

శ్లో॥ ఇంద్రేదేగుణోఽగ్నౌ యమపనవార్ధి
రన్యే పృష్ఠే వాయుదిశి ద్విసంఖ్యాః ।
కుబేరఈశే శశిబిందు రేకో
వస్త్రేషు సక్తో నవపుష్పవత్యాః ॥

తా॥ పృచ్ఛకుడుతూర్పుదిక్కునుండిగాని ఆగ్నేయమూలనుండిగాని యడిగిన మూడుబిందువులును, దక్షిణదిక్కునుండిగాని-నైరృతిమూలనుండిగాని యడిగిన నాల్గుబిందువులును, పశ్చిమదిశనుండియైనను వాయుదిశనుండియైననడిగిన రెండు బిందువులును, ఉత్తరేశాన్యదిక్కులనుండియడిగిన నొక్కబిందువును నూతనముగరజస్వలయైన స్త్రీ యొక్కవస్త్రమునందు పడినవియని దైవజ్ఞుండు చెప్పవలయును.

## రజోబిందు ఫలము.

శ్లో॥ ప్రాప్నోతి బిందునైకేన సౌభాగ్యం చ ద్విబిందునా ।
రోగ త్రిబిందునా భోగో దారిద్ర్యం బహుబిందునా ॥



తా॥ రజోవతియైనకన్యక ఒక్క బిందువుచే సౌభాగ్యమును, రెండు బిందువులచే రోగమును, మూడుబిందువులచే భోగమును. నాలుగుమొదలగు ననేకబిందువులచే పేదరికమునును పొందును.

## రజస్వలాచక్రము.

శ్లో॥ రజస్వలాయాం కన్యాయాం దిక్చక్రే భాని విన్యసేత్ ।
ప్రాచ్యాది దిక్షు చత్వారి త్రీణి త్రీణి విదిక్షు చ॥
భానుభా చ్చంద్రనక్షత్రపర్యంతం గణయే త్క్రమాత్ ।
ఆయుస్సంపదవైధవ్య పుత్రాన్ దిక్షు వినిర్దిశేత్ ।
విదిక్షు క్షతరోగార్తి మరణాని వదే త్క్రమాత్ ॥

తా॥ కన్యకరజస్వలయైనప్పుడు దిగాకారంబుగ నొకచక్రంబు నేర్పరచి తూర్పు - దక్షిణము - పడమర - ఉత్తరము - ఈదిక్కులయందు సూర్యుడున్న నక్షత్రముమొదలుకొని నాలుగేసినక్షత్రంబులును, ఆగ్నేయము - నైరృతి - వాయవ్యము - ఈశాన్యము - ఈవిదిక్కులయందు మూడేసి నక్షత్రంబులును లిఖింపవలయును. అట్లు లిఖించి సూర్యుడున్న నక్షత్రముమొదలుకొనినిత్యనక్షత్రపర్యంతము వరుసగా లెక్కింపవలయు, ప్రాగాదిదిక్కులయందు - ఆయుష్యమును, సంపదను, దీర్ఘసుమంగలీత్వమును, పుత్రసంతానంబును నిర్దేశించవలయు - ఆగ్నేయాదివిదిక్కులయందు క్రమముగ గాయమును వ్యాధిని పీడను మరణమును చెప్పవలయు.

## రజస్వలాదివారనిర్ణయము.

శ్లో॥ యుగం చ ద్వియుగంచైవ త్రియుగం చ చతుర్యుగం ।
సూతికాపతితోదక్య చండాలేషు యథాక్రమం ॥

# సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

# శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

# అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ


గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

# వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి.కనుక తమవంతుగా భక్తి,జ్ఞాన ప్రచారార్ధం మహానుభావులైన **సుందరయ్య విజ్ఞాన కేంద్రం** వెబ్ సైట్ వారు ఉచితంగా విలువైన గ్రంధాలను ఆన్ లైన్ ద్వారా eBOOK(PDF) రూపంలో అందిస్తున్నారు.వారు చేస్తున్న జ్ఞాన యజ్ఞానికి సాయి రామ్ కూడా తమవంతుగా సహాయం చేసే కార్యక్రమంలో భాగంగా వారి గ్రంధాలను సాయి రామ్ ద్వారా కూడా అందచేస్తున్నాము, ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం చేసిన ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in),మైక్రోసాఫ్ట్ సైట్(http://www.microsoft.com) వారికి కూడా మేము ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) **సుందరయ్య విజ్ఞాన కేంద్రం** వారి వెబ్ సైట్: http://sundarayya.org/
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com
సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement
సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము.



**SaiRealAttitudeManagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)**

* సర్వం శ్రీ సాయి నాథ పాద సమర్పణమస్తు*

## సుందరయ్య విజ్ఞాన కేంద్రం వారి వెబ్ సైట్:

## http://sundarayya.org/

Sundarayya Centenary Ce ×

sundarayya.org

# Sundarayya Vignana Kendram

Home | About SVK | Library | Projects | Donations | Publications | స్వేచ్ఛా విజ్ఞాన ప్రవంతి | Services | Contact Us

## Sundarayya Centenary Celebrations

### India Today: Looking Back, Looking Forward

India Today: Looking Back, Looking Forward
Watch Videos (Click to Download Papers)

On the occasion of the birth centenary of P. Sundarayya, a freedom fighter, communist and above all an individual who had given utmost importance to collecting facts and understanding them for political praxis, we feel it prudent to organise a seminar in his memory to comprehensively discuss and debate issues concerning the present, past and future of our country.

Read More

### Agenda

| Time | Session | Speakers |
|---|---|---|
| 4th May 2013<br>10:00-14:00 | **Synoptic Session One**<br>Imperialism and the Indian Economy<br>Patterns of Class Formation since Independence<br>Communalisms: Changing Forms and Fortunes Since Independence | Amiya Kumar Bagchi<br>Prabhat Patnaik<br>Aijaz Ahmad |
| 4th May 2013<br>15.00-16.30 | **Industry, Finance, Planning**<br>International Finance And Development in India under Neo-Liberalism<br>Capitalists and Industrialisation in India<br>Planning and the regime of Capital in India | C.P.Chandrashekhar<br>Surajit Mazumdar<br>Chirashree Das Gupta |
| 4th May 2013<br>17.00-18.30 | **Women in Economy and Society**<br>Economic Policies and Women's Work<br>State Policies and Women<br>The Political Economy of Violence against Women. | Jayati Ghosh<br>Smita Gupta<br>Kalyani Menon Sen |
| 5th May 2013<br>9.30-13.30 | **Synoptic Session Two**<br>Agrarian Question and the Post-Independence State<br>Non-Alignment to Dependence: Shifting Paradigms for Foreign Policy<br>State, Market and the Media | Utsa Patnaik<br>Sukumar Muralidharan<br>Sashi Kumar<br>P. Sainath |
| 5th May 2013<br>15.00-16.30 | **The Agrarian Crisis**<br>An Overview<br>Assets, Incomes and Employment<br>Credit,Technology and Public Policy in Indian Agriculture | Venkatesh Athreya<br>Vikas Rawal<br>Ramakumar |

# అతి విశిష్టం ఈ దానం!

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

తా॥ ప్రసవించిన స్త్రీకి ౧ కాడిమారుదూరమునను, జాతిభ్రష్ట లకు ౨ కాడిమారులదూరమునను, రజస్వలకు ౩ కాడిమారులదూరమునను, చండాలులకు ౪ కాడిమారులదూరమునను నిల్వవలయునేగాని అంతకు లోనగునప్పుడు అపరిశుద్ధులగుదురు.

రజస్వలాశుద్ధి.

శ్లో॥ ప్రథమేఽహని చండాలీ ద్వితీయే పతితా స్మృతా।
తృతీయే రజకీ ప్రోక్తా చతుర్థే శూద్రికా భవేత్॥
పంచమేఽహని శుద్ధా స్యా ద్దైవకర్మాదికర్మసు॥
చతుర్థేఽహని భర్తు స్సా చ్ఛుద్ధా సంభోగకర్మణి॥

తా॥ రజస్వలయైన స్త్రీ మొదటిదినంబునందు చండాలస్త్రీతో సమానురాలు. రెండవదినమందు మహాపాతకంబుతో కూడియుండు నెలతతో సరియైనది. మూడవదినంబునందు చాకలనెలంతుకతో సమానంబై నది. నాలవదినంబునందు శూద్ర స్త్రీ సమురాలగును. ఐదవదినమునందు స్నానాదులచే దేవకార్యపితృకర్మాదులవిషయమై పరిశుద్ధురాలగును. మఱియు నాలుగవదినమందు పెనిమిటికి సురతకర్మయందు స్నానముచే పరి శుద్ధురాలగును.

అంగారకదోషనిర్ణయము.

శ్లో॥ ధనే వ్యయే చ పాతాళే జామిత్రే చాష్టమే కుజే।
స్త్రీణాం భర్తృవినాశ స్స్యా ద్భర్తౄణాం దారనాశనమ్॥

తా॥ జన్మలగ్నమునకు ౨ ౪ ౭ ౮ ౧౨ ఈస్థానములయందు అంగా రకుఁడుండిన దోషమందురు. ఈకుజదోషము స్త్రీకి గలిగిన భర్తకువినాశం బును, భర్తకుగలిగిన స్త్రీకి వినాశంబునుగలుగు.



శ్లో॥ లగ్నేందుశుక్రా ద్దుస్థానే యద్యస్తి క్షితిసంభవః।
తద్దశాపాకసమయే దోష మాహు ర్మనీషిణః॥

తా॥ జన్మలగ్నమునకుగాని, చంద్రునికిగాని, శుక్రునికిగాని దుస్థా నమునందు అంగారకుడుండిన వానిదశజరుగునప్పుడు చెరుపుగలుగునని దైవ జ్ఞులు వచించెదరు.

అంగారకదోషపరిహారము.

శ్లో॥ దంపత్యో ర్జన్మకాలే వ్యయధనహిబుకే సప్తమేలగ్నరంధ్రే
లగ్నా చ్చంద్రా చ్ఛుక్రాదపి భవతియదా భూమిపుత్రే
ద్వయోర్వై। తత్సామ్యే పుత్రమిత్రే ప్రచురధనపతీ
దంపతీ దీర్ఘకాలం త్వేకోహీన స్తదన్యే భవతి మృతి రితి
ప్రాహు రత్రాత్రిముఖ్యాః॥

తా॥ స్త్రీపురుషులజన్మకాలమందు, లగ్నమునకుగాని, చంద్రునికి గాని శుక్రునికిగాని ౨ ౪ ౭ ౮ ౧౨ ఈస్థానములయందు అంగా రకుఁడుసమానముగనుండినయెడల పుత్రమిత్రులు, విశేషధనము, దీర్ఘా యుష్యంబునుగలవారగుదురు. వీరిలో ఒకరికిమాత్రము ఈకుజదోషముకలిగి మరియొకరికి లేనియెడల చెరుపుగలుగునని ఋషులువచించిరి.

శ్లో॥ చతుస్సప్తమగే భౌమే మేషకర్కాటలినక్రగే।
యదా రాశౌ శుభం ప్రోక్తం కుజదోషో న విద్యతే॥

తా॥ కుజుడు ౪ ౭ ఈస్థానములయందుండినను, అవి మేషము కర్కాటము, వృశ్చికము, మకరము ఈరాసులుగనుండెనేని శుభముగలుగు. కుజదోషపరిహారంబగును.

శ్లో॥ చరరాశిగతే భౌమే చతురష్టవ్యయే ద్వయే ॥
లగ్నే పాపవినాశ స్స్యాచ్ఛేషాః పాపవిశేషతః ॥

తా॥ కుజుఁడు ౪ ౮ ౧౨ ఈస్థానములయందుండినను ఆవిచరరాసులైనయెడల కుజదోషపరిహారంబగును.

శ్లో॥ పంచకస్థానగే దోషే లగ్నేందుగురుసంస్థితే ।
బుధే స్థితే న దోషోఽస్తి దృష్టే దోషం న చింతయేత్॥

తా॥ పై జెప్పిన ఐదుస్థానములయందు గలిగినకుజదోషము చంద్రుడుగాని గురువుగాని, బుధుఁడుగాని ఆలగ్నముులయందుండినను ఆలగ్నమును జూచినను దోషపరిహారంబగును.

*ఇతి స్త్రీజాతకే ఋతుఫలాధ్యాయ స్సమాప్తః*

---

శుభంభూయాత్.